# రాయలనాటి రసికతా జీవనము.

గ్రంథకర్త:
మహాకవి సరస్వతీపుత్ర
పుట్టపర్తి






ప్రకాశకులు:
విద్యోదయ పబ్లికేషన్స్,
కడప.

# విజ్ఞప్తి.

"రాయలనాటి రసికతా జీవనము" రెండవ ముద్రణము యింత త్వరలో కావడమునకు కారణ భూతమైన ఆంధ్రుల కళాభిజ్ఞతకు మా కృతజ్ఞత. ఈ గ్రంథమును రచించిన ప్రఖ్యాత కవులు, బహుభాషా వేత్తలుఅయిన "సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారిని మేము విశేషించి ఆంధ్ర ప్రజలకు పరిచయము చేయ నవసరములేదు. ఈ పుస్తకమును ప్రకటించుటకు కారణము — నేడు మన తెనుఁగునకు కావలసినవి — చక్కని సాహితీ సమీక్షలు. అవియును లావైన దస్తావేజులవలె, తేదీలు, రాజుల జనన మరణములు గాక — సుందరమైన రచనతో సాగిపోవలెనని. ఈ దృష్టితో — రాయలనాటి రసికతా జీవనమును — నాడు వెలువడిన మహాకవుల కావ్యములలో ప్రతిబింబించిన తీరును — సమన్వయించి కళాత్మకముగ నీ గ్రంథమును రచించిరి. ఆచార్యులవారి గద్యరచనలో — అమృతమున్నది. అనేక భాషల సాంప్రదాయముల క్షుణ్ణముగ జీర్ణించుకొని, తెనుఁగునకు మెఱుగులుదిద్దిరి. నవ్య కవితారీతులను గొనివచ్చిన భగీరథుని సృష్టిని ఆంధ్రదేశము ఆదరించక పోదని మా విశ్వాసము. రచయితలు, పురోగాములైన యువకుల ప్రోత్సాహముతో, స్థాపింపబడిన సంస్థకు ఆంధ్రుల అండ దండ లుండగలవని యాశింతుము.

విద్యోదయ పబ్లికేషన్స్.

# రాయలనాటి రసికతా జీవనము.

ఉ. భూరిశరాభ్ర విభ్రమము – పుష్కర రమ్యకరంబు దాన ల
క్ష్మీ రుచిరంబు – సత్త్వగుణ కీర్తిత మూర్తియు – వాలిసాల సం
హార విహార కారణము సౌ రఘుకుంజరభర్త యున్న – నం
బాధ మొనర్చె నీ యచల సానుతటంబుల నంబుజాననా!

(తెనాలి రామకృష్ణకవి)

మాల్యవంత, మతంగ, పర్వతములు-ఋశ్యమూకాం జనాద్రులు - ఈశైల శేఖరములకు రామాయణమున బ్రసక్తి గలదు. ఈ ప్రసిద్ధ పర్వతముల నడుమ నుద్భవించిన సాకారమైన విద్యారణ్యుల తపస్సే విజయనగరము. దూరమున 'నానెగొంది కుత్తరమున' "తార" పర్వతమున్నది. అంగది 'ఆనెగొంది' యయ్యెనని గొందఱన్నారు. అనగా 'అంగదుఁడు' బాలించిన పట్టణమట! దీనికి 'హస్తినావతి' యనియుఁ బాల ప్రాచీనమగు పేరు. విద్యానగర రాజు లచట యేనుగుల నిలుపుచుండిరి. కన్నడమున "ఆనె" యనఁగా నేనుఁగు. "ధరణిధమ్మిల్ల మాణిక్య"మైన యాపట్టణమునకు "అడుగున నుండి యుద్భదిలమై చపలంచెడు" నేడు కోటలు. ఆ కోట కొమ్మలు "గగన మండల శ్రేణికి సంపెగదండలవలె నుండెడివట! ఆ కోటలకు పాదుగగు" డంచనపు జేతులు!! బలిష్ఠములగు నా వప్రముల "పరిఖాజలము" మరకతచ్ఛాయ

లతో నిగ నిగ లాడెడిది. ఆ ప్రాకారములు "కులిశధారాహతి పాలు ప్రన బైనుండి యడుగు మోపగ జెగుటైన" "సొండూరుకొండ" లోయలకుఁ జొచ్చుకొని యుండెను. వానికి 'ఉదుటు గుబ్బలుగల దల్పుటురములు' -గండపట్టెలు. దక్షిణమున 'హొసపేట' కావైపు గడకోట: ఉత్తరమున "నానెగొంది" కాపల అటనుండి యటకుఁ గల దూరము పండ్రెండుమైళ్లు. ఊరికి దూర్పు వాకిలి "దరోజి" దానినుండి గంపిలికిఁగల దూరము బదిమైళ్లు. ఉత్తరద్వారము "తోరణగల్లు". రాజులు జైత్ర యాత్రలకు వెడలి జయశ్రీ ముదది గ్ధులై వెనుకకు వచ్చునపుడు ఊరనున్న "ధన్నాయకులు" వారిని "తోరణగల్లు దగ్గర బలములతో నెదుర్కొనెడివారు. ఆ తోరణ గల్లు కడ" నడ్డముగ బ్రహ్మాండ కాయములతో కుంభకర్ణుల వంటి శిలలున్నవి. వానికి 'విజయ తోరణములు' గట్టుటవాడుక. ఆ రాజులు నగర ప్రవేశము సేయునపుడు రథ్యల కిరువైపులను "ప్రత్యగ్ర సాలాగ్ర హర్మ్య విటంకంబులు ప్రాకి వల్లి పనసాస్యలు ఉత్ఫుల్ల పల్లవ హస్తముల సాచి భావి భావుక ఫలోల్లాసంబుతో" (వసు 1-131) గ్రొవ్విరులు సల్లెడు వారట!

విద్యానగరము నందు కాపలివారి కేలుకలేక "యీగ" దూరుటకు వీలులేదు. * అచటికి వ్యాపారమునకై వచ్చిన విదేశీ

---

* Frederick says that they used to sleep in the streets or under tarases for the treatening heat which is there and yet they never had any harm in the night (Aravindu dynasty-by He ras Page 71.)

యులు ఆరు బయిళ్లయందే బండుకొను చుండిరి. ఎవరైనను, దొంగతనము గావించినచో ఆరాజులు విధించు శిక్షలు చాల కఠినములు. రాత్రుల యందు నూరంతయు వేయి కన్నులతోఁ "దలారులు" దిరిఁగెడువారు. ఒక్కొక్కసారి రాయలుగూడ దలారులకు దెలుపక గుఱ్ఱమెక్కి దిరుగుట వాడుక. ఎక్కడైన నేదైన విశేషము రాయలకంటఁబడినచో, ప్రాతఃకాలమున దలారులను బిలిచి, 'యా సందులో రాత్రియేమి జరగినదని ప్రశ్నించెదరు.' వారు సరిఁగా జెప్పలేకున్నచో జరిగిన వర్తమానమును వారికిఁదెలిపి "యిక మీద జాగ్రత్త" యని హెచ్చరించెడి వారట! ఏ యింటనైన దొంగతనము నడచినచో నావస్తు క్రయమును దొలుత "తలారి" యిచ్చుకొనవలెను. ఆమీద వాఁడు దొంగకై వెదుకవలెను. రామరాయల కాలమున గాబోలు నొక విశేషము జరిగినది. సాధారణముగ గొండల కనుమలలో దారి దోపిడిగాండ్ర నరికట్టుటకై ఉంచుట "దలారుల" నేర్పరుతురు. వాని యాధీనమున గొంత సైన్యము. ఆ పనికై వానికొక మాన్యము. ఒకసారి యొక కనుమలో దారి దొంగలు వ్యాపారులను కొట్టినారు. ఆ ప్రాంతముల 'తలారి' యా నష్టము నివ్వవలసి వచ్చెను. వాఁడు దనయాస్తినంతయు నమ్మినాఁడు. నష్టమునకుఁ జాలలేదు. అపుడు వాఁడు తన భార్యతోఁగూడ భిక్షమెత్తి యా వర్తకుల యప్పుదీర్చెనట! ఆ రాజుల యాజ్ఞ అంత నిష్కరుణమైనది.

విద్యానగరమున నన్ని బురుజుల యందును, కోటవాకిండ్లను "యమ భటులవంటి వీరులు" రేవగలు గాచి, యుందురు.

కుంతలాధీశుల కెప్పుడును అశ్వపతులతోఁ జీపఱ. అందుచే విద్యానగరమందేడవకోట కావల "పంగల రాళ్ళు" పాత బడిన వి. అవి వెంట వెంటనే సర్పముల గమనమువలె మెలికలు జుట్టి యుండును. మనుష్యులైన నొక్కఁడొక్కఁడే వానిద్వారముస రా వీలుపడును. హయముల కడుగు పెట్టనే సాధ్యముగాదు.

విద్యానగరమున కుత్తర దిక్కున రక్ష, సాక్షాత్కరించిన భువనేశ్వరీదేవి తుంగభద్ర. కడమ యన్ని కడల యందును, ఉత్తుంగ పర్వతములు ఫణములెత్తిన యాది శేషులవలె నుండెడివి.

పట్టణమున బ్రవేశించినంతనే, గంటికి బ్రత్యక్షమగునవి నిలువెత్తులేచి "యమృత రసగర్భములైన" జెఱకుఁ దోటలు. వరుసలుగట్టి నిక్కిన ఫణిరాజువల్లుల తోడి "యాకుదోటలు." ఆకు దోటల్లలోననే అక్కడక్కడ నెదిగిన పూగీవృక్షములు. నడుమ నడుమ "కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛములు." "మీటిన విచ్చుఫలస్తనాగ్రములతో" చలిత లతాంత కాంతియును చందురు కావి చెఱుంగులు" దాల్చి "మోహప ధూప ధూమ కుంతలములు" విచ్చుకొని 'సౌందర్యమంతయు మూదే జూడుమనుచున్న దాడి మీలతాతరుణులు. కనుచూపుమేర' రతి క్రాంతాంగనా నేత్ర కోణ నికాయుంబుల 'కావులు' తెరలు తెరలై, నిలిచినటులున్న, విచ్చిన గొజ్జంగి వనములు. మారుతా హతిరాలు నారికేళఫలాప ళులు. చక్రోడపంష్టులు చెక్కిన సుగంధి యనంటి పండ్లు. పాక వేళారంభ పరిపాటితో పమయుంతఁబగిలిన పనస క్రొంబండులు.

ఆ పండ్లు "వసంత మద ద్విరదముల" యట్లుండెడివట! వానితోనలి తావులకై - రసములకై - వచ్చి, కదలక మెదలకున్న తుమ్మెదలు వాని" ఇనుప సంకెలలట! ఇది గన్నడరాయని వర్ణన.

ఉద్యానవనములను దాటిపోయినంతనే, వరిపైరులు కనుచూపుమేర గనుపించెడివి. అవి యన్నియు తుంగభద్రా "సారసారములతో" ముక్కారును బండును. తుంగభద్రా తటములలో స్నానములాడు 'కాంతల చనుమిట్టలందొలఁకు పట్టుపుటట్టుపునుగు వాసనతో' నా కాల్వలు పారును. అందుచే నా జలములతోఁ బెరిగిన రాజనపు ధాన్యము లాతావులనే వలచెడివట! (వసు, 1-112) ఆశాలిక్షేత్రములలో, అక్కడక్కడ, నుద్యానవనములు. వరిపైరుల మధ్యబాటు 'తుంగమ్మ' కాల్వలయందు వికసించిన కలకల నవ్వు 'ఉన్నాళ నాళీకములు,' 'తావులు క్రేవల జల్లు చెంగలువలు,' నడుమ నడుమ, కర్ణాటాంగనల కనుచూపుల యందమట్టిదని మిట్టిపడు తళుకు బేడిసలు.

కుంతలము నందనేకములు వరిజాతులుండెడివి. ఈ సన్నివేశమును రాయలు మనోహరముగ వర్ణించినాడు.

మ॥ సొరిదిం జేర్చిన సింగమల్లియలు ఖర్జూరంబులున్ పుష్ప మం
జరులున్ మామిడి గుత్తులున్ కుసుమముల్ సంపంగెలున్ పచ్చిగ
న్నెరులున్ - బావెలుగగ్గి - రాజనము కాంతిన్ దాటు మల్యాళి - చే
ఉసవార న్నగు బూవుఁదోఁటల బలాకానీక దంభంబునన్.

(ఆము. 1—66)

ఆ యూరి యందలి వరిచేలకును, నుద్యాన వనములకును జోటి యేర్పడినదట! వరిజాతులన్నిటిని, తోటలు, వనయందుఁ జూపినవి. కాని వానియందు 'రాజనములు' లేవు. అందుచే నా పందెములో 'శాలిక్షేత్రములు' గెలిచినవి. పందెము గెలిచినవారికిఁ బరిహాసము స్వభావముగదా! అప్పుడు 'శాలిక్షేత్రములు' బలా కాసంఘమున' పందెమున జిక్కిన దేటలను వెక్కిరించు చున్న వట!

ఒకటవ కోట నుండి, మూడవ ప్రాకారము వరకు, నీ ప్రకృతి లక్ష్మి విచ్చలవిడి సేయునాట్య ప్రదర్శనములే! పరిమళం బుడివోని విరులతావులు, బొందుతో మాతె లనంగనున్న రసదాడిగ నెలగుంపు. వానిని 'జీనువులు' జిగియు బిగియుగల తమ చంచు వులతోఁ జించెడివి. అపుడా యురటిపండ్ల నుండి రసపూర మూరును. అది యెటులుండెననఁగా పురాంతిక సీమలలో శాలి పాలికల పాటలకుఁగరగి, కన్నీరు వెట్టినట్లుండెడివట! వారి గాన మంత జగదభిరమ్యమైనది. ఈ యుత్ప్రేక్ష భట్టుమూర్తిది. (వసు 1-113) ఆయన సంగీతగాఁడు గదా!! అచ్చు టచ్చట 'ఉద్యానం పులోత్రోవలయందు' పాగడపు పాదముల 'ఘులంఘులలు' శ్రుతి రమణీయముగ 'వినిపించెడివి' ఆరామాంబు కుల్యాబహుస్రోత స్సంధులయందు అంధు యంత్రసతి కృత్ప్రోద్గీత గేయౌఘములును.

మూడవ కోటనుండి మచ్చలైన యిండ్లారంభమగును. ఆ గృహములు యెంత విశాలములో అంత ఉన్నతములు. చిత్ర

విచిత్ర శరీరములు వానివి. వాని శిరస్సులపైఁ గలశముల నిల్పి యుంచెడివారు. సౌధములు - మహారాజుల కవి 'బొమిడికముల వలె' నుండెడివట! తెల్లగానున్నముఁ గొట్టబడిన ఆ మేడలకు నిత్య సౌభాగ్యము వచ్చుతీరఁబడును. ఆ సౌధములు సున్నపు కాంతులతో సకాలచంద్రికల నీనుచు దమ పేరును సార్థకము జేసికొనుచుం డెడివి. ఈ క్రింది శాసన శ్లోకములు గమనింపుడు.

అస్తి విస్తీర్ణ కర్ణాటధరామండల మధ్యగః
విషయః కుంతలో నామ్నా భూకాంతా కుంతలోపమః

విచిత్రరత్నరుచిరం – తత్రాఽస్తి విజయాభిధం
నగరం సౌధసంతాన దర్శితాకాండ తాండవమ్.

ఈ ప్రదేశములయందే అక్కడక్కడ మట్టిమిద్దెలు, గుడి సెలు, పానకమునందు పుడకలవలె నుండెడివి.

ఏడవకోటయందు రాచనగరులు, వారి యుద్యోగుల గృహ ములును. రాజద్వారమునకు ముందు నాలుగుపేటలు, పొడవు వెడల్పునవ్యాపించి యుండెడివి. ఉత్తరమునుండి దక్షిణమునకు గొన్ని, కొన్ని తూర్పునుండి పడమరకు, ఉత్తర దక్షిణములకున్న పొడవొకమైలు. తూర్పు పడమరల పేటల పొడవు రెండుంబావు మైలు. రాచనగరునుండి మొదటి కోటకుఁగల దూరమొనిమిది మైళ్లు.

విద్యానగరమునందలి పేటలతివిశాలములు. అవి నలుపది యడుగుల వెడల్పుండెడివట! వంకరటింకరగ 'చేపల బుట్టల్లి నట్లు' లేక 'సూత్రపట్టినట్టు' వానిని జక్కఁగఁ దీర్చియుండిరి

మార్గముల కిరువైపుల, చలువగల నీడల నొసఁగు చెట్లు. వానికి రెండుప్రక్కలను తుంగభద్రలోనుండి పటికంపు దొనల 'లో ప్రవహించెడు' తుహినజలము! నేఁడుగూడ నాపాడువారినపట్టణమును జూచినచో, గృహములలోనికి, నాటిజనులు 'చిఱుకాల్వలను' దెచ్చికొన్నట్లు స్పష్టముగ గనిపించును. వీధులలో నడుమ నడుమ రథ్యాకూపములు, వానిలో మొలచిన యంతర దామరలో - నది యొక వయ్యారమును జిలుకు, చెంగలువలు, తామరలు. కౌళ కౌళమని యూయు 'నీరుకోళ్లు.' పైనుండి ఱివ్వునదూకి, మీల గఱచికొని, పాఱుచు, సరోలక్ష్మి జెండాడునటులున్న లకుముకులు సరోవర జలములలో, తిన్న యాహారమరుగక పదస్వరము గీచులాడుకొను పలుప వాలుగ మొత్తము.

ప్రతి పేటయందును, మొదటను, తుదిని, హిందూ ముస్లిం సంప్రదాయముల ననుసరించిన కమానులుండును. వానికి బెఱవురాళి గృహశ్రీలఁ జెండ్లియాడ, భవన దాఱాలు గట్టిన బాసికమన (ఆము 1-53) వెలుఁగు తోరణములు. కమానులపైన 'చేతనంబుల కచేతనత్త్వము, అచేతనములకుఁ జేతనత్త్వమాపాదించు యొయ్యారుల బొమ్మలు, త్రోవలందుగూడ నక్కడక్కడ, తరుణీ శిల్పములు జెక్కఁబడియుండును. వారి చేతులయందు ధరించిన కరండములనుండి 'యగరు పొగలు' 'బుగులు బుగులున' లేచును; లేచు నా పొగలు తాపింఛ గుచ్ఛ సచ్ఛవులు - విరియబారిన మదమత్తకేకి పింఛముల నపహసించెడివి. వీధులందచ్చటచ్చట - బహుశః కోవెలలకు కొంచముదూరమున-నొకటి రెండు దేవులనిల్పి

యుంచెడివారు. "లిఖిత నరావాప్త దాంపత్యము" లైన యా రథములు "గళ్యాణ మంథాదుల నపహసించెడివట! (ఆము 1-58) అనఁగా నంత యెత్తయిన వన్నమాట!

రాజుల దివాణమునకు సమీపముననే - వారి మూల బలము లుండెడివి. రాజుల సొంత సైన్యముననే పదునొకండు లక్షల "ఆరట్ట ఘోట్టాణములు," నాలుగువేలు "దృక్పుటలు పైరులమీదికి గృత్యలన బంపు (ఆము 2-24) మదించిన గజములు. రాయలవారి బలగమె పండ్రెండువేల దాసీలు - యౌవనమున నూగువారుచున్న దేహములవారు. ఆరువేల మంది రౌతులు, పచ్చయినను పిడికిలింత మనువారు, దివా రాత్రములా రాయలను గాచియుందురు. మూడువేల 'కుంతధారులు' వారి గజశాలకుఁగాపు. కృష్ణరాయునికి ప్రత్యేకమైన "లాయములవారే" వేయిపైగా నాలు నూఱులట! రాచవారి గుఱ్ఱములకు "నట్టువ" నేర్పెడి "నాట్యాచార్యులు" రెండు వందలు. అంతఃపురములో అమ్మగార్లకుఁ గావలసిన సొమ్ములు చేసియిచ్చుటకుఁ గంసాలురు రెండువేలు, రాజునకు వంటకము వండెడు "నల భీమపాకము" నేర్చిన వంటలవారు రెండునూరులు. ఏమి చెప్పవలెనాహడావిడి! ఆ ప్రదేశమంతయు - భూమికి నలిగావుపచ్చిన, అమరావతివలె నుండెడిది. రాజధాని యందెల్లకాలమును, రెండు వందలమంది మండలేశ్వరు లుండెడివారట! పై మాటలన్నియు నాటి విదేశ యాత్రికులు వ్రాసిన వ్రాతలు. మనవారే యీ మాట లనియున్నచో

"పర ప్రత్యయ నేయ బుద్ధులైన" మనము - వాని నెన్నఁడో యుత్ప్రే క్షలక్రింద జమ కట్టియుందుము.

విద్యానగర మానాఁడు చాల జన సమ్మర్దమైన పట్టణము. నగరమునందలి ప్రజాసముదాయము ముప్పది లక్షలకు మించి యుండెడిది. రాచనగరునకు ముందు సర్వకాలములయందును యిరువదివేల పల్లకులు తయారు. వానిని గాచుకొని రెండులక్షల బోయీలు. విద్యానగరమునుండి గోవాకుఁబోవు దారులెల్లకాల మును, జనములతో, బండ్లతోఁ గిటకిటలాడు చుండెడివి. విదేశీయ వ్యాపారులు, వెలగల పట్టుబట్టలు, హయములనక్కడికితెచ్చి, యిటనుండి రత్నములు, ముత్యములు, బంగారు, మొదలైనవి గొని పోయెడివారు. గోవానుండి ముఖ్యముగ బుడుతగీచులు బంపు చుండినవి గుఱ్ఱములు. వానిని "పోర్చుగీసులు" పర్షియా, అరేబి యాల నుండి తెచ్చెడివారు. వాని కొనుగోళ్ళలో, నెప్పుడును, బహ మనీ సుల్తానులతో, కుంతల రాజులకు పోటీ. ఇతర చోటులనుం డియు విరివిగ వ్యాపారము లుండెడివి. నాటి నావికావ్యాపార మును రాయలిట్లు వర్ణించినాఁడు.

మ॥ ఘనసౌధాళి వియద్ధునీజలధి వీకన్నావలై నీఁడ దో
ప — నెలంత ల్వణిగాకృతిన్ సరకుమార్పన్ గోలలన్ గట్టి యి
చ్చు — నవద్వీప విచిత్ర పట్టవసనస్తోమంబునాఁబొల్చుఁ బె
ల్లనిలాన్యోన్యవిమర్శి తన్నగరనాకానేక కేతుచ్ఛటల్.

(ఆము. 2-12)

ప్రతి దినమును విద్యానగరమునకు వచ్చి పోయెడుబండ్లు రెండువేలు. ఇవి చెల్లించెడు సుంకమే దినమునకు లెక్కలేనంత. విజయనగరపు రాచవారు "వాలి బండారము" కడను, పంపా సరస్సునకు దగ్గరనున్న కొండలలోను, భూగృహములు గట్టి ధనములు దాచెడివారని ప్రతీతి. కొండ సందులకు పాల గచ్చులతో వారమరచిన కప్పులిప్పటికిని మనకంటఁబడును. "ఆనెగొంది" దగ్గరనున్న "తారపర్వతము" సందున పెద్ద గవులున్నవి. వానికి చిత్ర చిత్రములైన మార్గములు కలవు. ఇక్కడను ధనములు దాచెడివారని జనశ్రుతి. మన కెప్పుడైన మోసములేని అంజన పెద్దుఁడు దొరికినచో బాగుండును: మన దారిద్ర్యమంతయు నొక నాటితోఁ దీరిపోవును.

ఒక విజయనగరమందే నాలుగువేల కోవెలలు. అవి శైవములు, వైష్ణవములుగూడ. ఉభయ సంధ్యలయందు నచట దేవదాసీల నృత్యముండెడిది. నటన ప్రోద్యోగసజ్జీభవ ల్లలనావర్తిత కైశికచరిత కల్హారాళి నల్లార్చుచు – ప్రాతస్సంధ్యలలోఁ వడిగాలులు – క్రొత్తగా వాసనలు బూసికొన్న దక్షిణనాయకు ననుకరించుచు బారాడు చుండెను. ఇక వైష్ణవాలయముల వైభవము చెప్పనక్కరయేలేదు. వారు తమ భోగప్రియుతకుఁ దగినట్లు తమ వైవమునుగూడ, పరమ రసికునిగా మార్చిన మహనీయులు. ఆ దేవాలయముల "పణ్యారంపు పుణ్యాంపు కంపులు" విష్ణుభక్తి యట్టిదని చూపుచుండెను. భాగవతులు – వారివలెనే దరిసెనమునకై వచ్చిన వైష్ణవాంగనలు – "తళియలు" భుజించి యా సూనెచేతు

లను కంబమునకుం బూతురు. ఆ జిడ్డువేఱు స్తంభము లానాటి "కంచుటద్దముల" మించులను బరిహసించెడివి. జైనాలయము లకు - రాచనగరు దగ్గరనే స్థానముండెను. విద్యానగరమును మొలుత బాలించిన "సంగములు" శివపారమ్యులైనను, తరువాతి రాజులు వైష్ణవులైనను, యెదిరి మతముల కే బాధయు గల్గించిన వారుగారు. బుక్కరాయల కాలమున "శ్రావణ బెళగొళలో వైష్ణ వులకును, జైనులకును, బెద్ద వివాద మేర్పడినది. దాని కొమ్మలు, రెమ్మలు ఆనెగొంది హొసపట్టణము, పెనుగొండ, "కల్లెహ" మొద లైన యూళ్లకును వ్యాపించెను. అప్పుడు జైనులు, వైష్ణవులు దమ కన్యాయము సేసిరని, రాయలకు "పిరియాదు" చేసినారు. శ్రావణ బెళగొళలో, బ్రహ్మాండమైన సభలు "బుక్కరాయలు" జేర్చెను.

పదునెన్మిది నాడులలోని వైష్ణవులక్కడ జేరినారు. ఇంకను దివ్యదేశములలోని దేవాలయాచార్యులందఱును కూడిరి. అనే కులు సన్యాసులువచ్చినారు. ఇంతమంది యెదురుగ బుక్కరాజా వివాదమును బరిష్కరించి, జైనులకును వైష్ణవులకును రాజీ కుదిర్చిరట! ఆ రాజీ షరతులను, దన సామ్రాజ్యమందలి, యన్ని బస్తీలలోను, శిలాశాసనములు వేయించెను. ప్రౌఢదేవరాయ లెం దఱినో మహమ్మదీయులను దగ్గరకుండీసి, వారికిం బేటలేర్పాటు చేసినాడు. వారికి మసీదులనుగూడ గట్టించి యిచ్చెను. కొలువున వారు "సలాము" చేయుటకై "ఖురాను" నుంచినాండు. ఆ తరు వాత రాజు లీ మర్యాద నెంతయో గౌరవించిరి. కృష్ణరాయలు

యవన కోశాధిప స్థాపకుఁడే యైనాడు. మహమ్మదీయులతో బద్ధద్వేషము సాధించినవాఁడని మన మనుకొనుచున్న రామరాయలు గూడ, యొక మహమ్మదీయ రాజకుమారుని దత్తుకొడుకుగ జూచికొనెనట! విద్యానగరము పేరుసార్థకముగా నచ్చటి "విద్యాలయములకు" లెక్కలేదు. "ఊరియందేచోటఁజూచినను" అష్టకోణజలక్రీడాగారములు. మురజముల రవళితో నిరంతరము మర్మ్రోంచు నాటకశాలలు. "మొలకట్టుల జిలుగులతో వింతనీరాజనము లెత్తినటులున్న నృత్యశాలలు.

ఆ నగరవాసుల భవనములు, సామాన్యులైన వారివిగూడ, మన యిండ్లకన్న మెఱుఁగే. ఇంటికి ముందు రెండు వితర్దికలైనను నుండెడివి. వానికివలావల నొక్కొక తరుణ సహకారమునో, కాక యొక్కొక పారిజాతమునో పెంచెడివారు. కుట్టిమములయందు, రెండు మూఁడు "కోరకిత నారి కేళక్ష్మారుహములు" పెంతురు. అవి "జలసూత్రస్తంభములట. (వసు. 1-158) ఇంటి ముందుఁజెక్కి యొకవైపున రెండప్సరసల విగ్రహములు అతిథులను గనుచూపులతోనే యాహ్వానించు చున్నట్లు. ప్రతి గృహమునకు, కొలకుల యందు, జాజి, విరవాది, సంపెగ మొదలైన తీగెలను వారు పెంతురు. ఇంటి వెనుకఁగొంత విశాలమైన యుద్యానవనము లుండెడివి. వానిలో కృత్రిమముగ తయారుచేయబడిన తుంగభద్ర కాల్వలు. వాని గట్టుననే చలువరాళ్లతిన్నెలు. అవి "వనమాన ప్లవమాన పంకజరజస్సులో" పడపాడినట్లుండెడివి. ఆ యుద్యాన వనములలో పర్వకాలములను, విరిసిన విరులు, రాలిన రజంబు

లొలికిన రసంబులు, ఉరలిన ఫలములు. (పసు. 1-133) వాని యందలిచెట్లకు కాల పుష్పములకై దోహద క్రియలుసేయుట, వివిధ జాతుల కంట్లుగట్టి చిత్రముల గనుపరచుట నాటి జనులు నేర్చిన విద్యలు. భాగ్యవంతులైనచో నొక కేళాకూళి నేర్పరచి కొందురు. కృతకాద్రులకు హంపిలో దారిద్ర్యమేలేదు. ఇంటి వెనుక నొక దిగుడు బావి యుండెడిది. వానిమెట్లకలపై వివిధము లైన శిల్పములు. వేసంగులయందు జవరాలితోగూడ వరుడు జల క్రీడలాడును. వారి గృహములయందొక రాయియైనను యలం కారహీనముగనున్నచో, ఆ జనుల మనస్సు "కళక్కు" మనును. ప్రతిచోటను కొంచెము సందుదొరికినచో నొక చేపను, నెమలిని, కడకొక మల్లెపూవునైనను జెక్కించెడివారు. కుడ్యములకు వారు వర్ణ చిత్రములు వేయుదురు. ఒక్కొక్కపు డిండ్ల కప్పులనుగూడ తైలవర్ణ చిత్రములతో నలంకరింతురు. పలకలపైఁ చిత్రించుట బాగుగావారికి దెలియును. రేఖా చిత్రములనుగూడ - ఆ జనులు గీయుచుండిరి. వారియిండ్లలో భోజనశాలలు, మజ్జనశాలలు, చిత్రశాలలు వేఱువేఱుగ నుండెను. మనకు దెలియని మఱియొక విశేషమానాఁడుండెడిది. అది కోపగృహనిర్మాణము ఇంటి ఆవిడకు మగనిపై కోపము వచ్చినపు డామె యాగదిలోనికిఁబోయి దూరికొనును. కాని యా కాలమందును, మగవారికిఁ గోపగృహ మున్నట్లు గనుపించదు. ఈ నాఁడేగనుక, కోపగృహముల యాచారమున్నచో, మగువలకన్నముంచే, మగవారక్కడ జేరి యుందురని నా యనుమానము. కారణ మేమనఁగా, మన

కీనాఁడు సంపాదించి పెట్టలేక, దినమున కొక్కసారియైనను భార్యపైఁ గోపము వచ్చుచుండును. ఆ నాళ్లలో నైనను, అందఱు కవులకు కోపగృహముతో నక్కరలేదు. ముక్కుతిమ్మన్నకు మాత్ర మా యవసరము గలిగెను. కృష్ణునిపైఁ గోపమును గొన్న సత్యభామాదేవి, చీకటింటి కడకంకటిపై జలదాంత చంద్రరేఖా సదృశాంగియై శరీర మొకచోట పొందక, పొరలి పొరలి యేడ్చె నట! ఏవాస్తుకారుఁడు గనిపెట్టినాఁడోగాని కోపగృహములవాడుక చాల మంచి యాచారము. కోపగించిన యావిడ చీకటింటిలోఁజేరి నచో తక్కినవారు తకరారులేకుండ, తమపనులను జేసికొన వచ్చును. ఆ కాలమున నెక్కువ భాగ్యవంతుల యిండ్లలో, యంత్ర పాంచాలికలుండును. వాని శిల్పసౌందర్యముచే నితరుల భ్రమింపఁ జేసినచో వారికిఁదృప్తి. సాధారణముగ నందఱి యిండ్లలోఁ బెరలను వాడుటయు నాటి యాచారము.

సాయంకాలమందు విజయనగరమునకు స్వర్గమే వలన వచ్చును. పుష్పలావికలు, సాక్షాత్కరించిన సౌందర్యములు, వీధుల కిరువైపులనిలచి "కాయజుతూపు" లమ్ముచుందురు. వారు "సురత వైయాత్యనిధులు" వయువలఁచి విడిచిపెట్టిరేగాని, రంభాదులైన నొరయఁగానె కొంగునవే వారించి – మీ యూరికిఁ బోయిరమ్మందురు. వారమ్ము పూవులకంటెను, ఆ పుష్పలావికల పలుకులు వాసనగలవి. విజయనగరమునాటి వారికిఁ జాతుర్యము వెన్నతోబెట్టినవిద్య, వారి సంభాషణమును రాయలిట్లు వర్ణించి నాడు.

సీ॥ చెంచి! యీ నీదంత పెలయేంత, నా దండ
కును వెలఁబెట్టి నెప్పని తరంబు
కలువతావులు గావు మలికదంబకవేణి!
కలువరావులు వాడకయుఁగలుగునె!
కదిపోదు నాకెమ్మ పచతి! యీ గేదంగి
ననగడిపోమి యుందటికిఁ జూపు?
జాపకే వంబుజేక్షణ, పద్మినులు నైత
మును నున్నయెడ జాతుజనికియదుదె!

(ఆము. 2–19)

వారియందు ముగ్ధలుగూడ నున్నారు.

ఉ॥ సరసుల సర్మమింపుల నొసంగఁ గదంబపు దండఁగట్టుచో
గరగరఁ బెల్చు పృచ్ఛకర కొంటులు నుత్తరమిచ్చు నంత రాం
తరముల నవ్వులున్గలువ తండము మొల్లలనంచు — మిన్ను గ్రు
చ్చిరహిని — రిత్తనూలొసఁగి — సిగ్గు వహింతురు పుష్పలావికల్

రాయలవారి మనోహరమగు విభావమును:—

'మల్లెనె యలర్విడిదు కెంజాది యెందీవ
రుల్లాసదింద నీలోత్పలవ నెకెసగేయ
సొల్లిందకు ముదపెందు నిదువల్ సురహోన్నె
యుటర మాటె యనొప్పవ

సల్లలిత కాయదు సరసికెత్తి సూరగి యం
దెల్లగ్గెతో సువ వరుణ తామరస మం
దెల్లనగ్గాజెయు సీమసి పుండరీకమం
దెచ్చరి వరేళ వెణ్ణెల.

అని లక్ష్మీశుఁడు పకలుఁ గొట్టినాఁడు:-

పరిభాష పోతె దమ్మాసదొరల నాడ – మోవిజెఅంగిడి – అగు సప్పకంటు నిగుడ విరుల్వాన్చు కలనుజల్లు "సరసపు జలము తోడనే పల్లవుల మనసు మరులుగొల్పు చాతుర్యవతులు గూడ నుండిరి". చతురవచన విలాసాంగసౌష్ఠవములతో వారు పతికిఁ గైదువలందిచ్చు సతి విధమున, విటులకు విరుల నందియిత్తురట! ఈ విలాసవతులకు, నడుమ నడుమ, పొరుగూరులనుండి, పూలమ్ముకొనవచ్చిన, గ్రామ్యేతరుణీతతి, "పురవాసులకొండెలపైకి" చెక్కుకొనుటకు ప్రేప గంపలలో చెంగలువ దండలమ్ముచుం దురు. ఇకను వ్యాపారముచేయు నేగిన పురవాసులందరూ! పూలు గొనెడి కథ దేవుఁడేఋఁనుగాని యా పుష్పలావికలతోఁ గొంతసేపు దనివిదీర ముచ్చటలాడెడివారు. ఇంటికివచ్చిన తరువాత తమ సరస సంభాషణముల నింటి యావిడతోఁ జెప్పుదురు. ఆమె భర్త పైన నసూయపడెడిదిగాదు. ఆ కాలపు ఆడువారు నాకుఁజూడ చాల మంచివారు.

ఈ జీవన విధానము "నేడు" మనకు సరిపడదు. ఇట్టివారి నందఱిని వరుసగా "పోకిరీరాయళ్ళు" క్రిందఁ గట్టివేయుదుము.

కేవలము నీరసమై, అనుత్సాహము యొకకలంటఁ గొరికివేయఁగా ఉండియు ఊడినట్లున్న, జీవితము నేడు మనకుఁ గావలసినది. ఇట్టిపనులు ఈనాడు మన మనహ్యించుకొనునది కేవలము "ధర్మ వీరులమై "గాదు. మన ప్రాచీనులు సాధించిన "ధర్మపుమేరలు." జాల గొప్పవి. మరి "మనస్మశాన వైరాగ్యము" నకు గారణము శారీరక . మానసిక బలము తగ్గిపోవుటయే. అరకప్పు కాఫీతో ఆకలి దీర్చుకొను జాతికి అరసిక జీవనముగాక మరి యేమి లభ్యమగును! కాని, నా బాధ యేమనఁగా, మన పతనస్థితిని దల పోసి, గట్టిగ నేడ్చుటకుఁగూడ మనకు దెలయదే యని,

ఆ నాఁడు పరమ వైరాగ్యవంతుఁడనిపించుకొన్న ప్రవ రుఁడుగూడ వరూధినితో నిలిచి నిమ్మళముగ మాటాడినాఁడేగాని, తాను పరనారీ సహోదరుఁడనని రెండు కన్నులును మూసికొని, ధృతరాష్ట్రపాత్ర నభినయింపలేదు. ఈ వాసనసోకిన యొక తెనుఁగు పండితుఁడు మా కుండెను, ఆయన యొకసారి పూలు దెచ్చుటకు వెళ్లినాఁడు. వింత బెళుకులతో "కొత్తిమిరె" కాడవంటి యొక పిల్ల విరులమ్ము చుండినది. దానిని జూచిన వెంటనే, బాల వ్యాకరణ భాషలో లీలగా విరిబోఁడీ! విరులిచ్చెదవా! యన్నాఁడు. పండితు లంత వ్యాకరణ మా పడఁతి జదువలేదుగదా! దానికి విరులను మాట యర్థముగాలేదు. "బోఁడి" యన్నదర్థమైనది. పెండ్లియై లక్షణముగ, మగనితోఁ గాపురము సేయుచున్న తన్ను "బోఁడి" యన్నాడని, అయ్యవారి కైదుపరహాలను జెల్లించినది. స్నానము లేకుండనే పండితులకు, వీపుపైనున్న దుమ్ము వదలెను. దాని

శరీర స్పర్శలోఁ దృప్తిబొందిన యా రసికుఁడు "ఆకోమలి కొట్టినా పరవాలేదులే" యనుకొన్నాడట! అదియట్లుండె.

అక్కడి గట్టివాల్పతులట్టివారు:—

చ॥ దళమగు చంద్రఖండములు దారలు సాంకవ మొప్పు పాటి పా
టలమగు దంతపుం గరవటంబు శశాంపుఁడు — గుంకమైన చీ
రల జిగికెంపుగా బయట రత్నల నొప్పుదు రిందు కాంత వే
దులవయి — సంధ్యయే బహుతఁ దోచెననన్ పురిగట్టి వాల్పతుల్.

(ఆము.)

పుష్పలావికల, గట్టివాల్పతులచాతుర్యము లర్థముగాక విదేశరాయబారులు "దిగాలు" బడి చూచుచుండిరట! సాయం కాలములయందు "రత్నములు" "ముత్యములు" మొదలైనవి గుప్పలువోసికొని యమ్మెడివారు. విద్యానగరమున మడి సంత యొకటి, మైల సంతయొకటి, మైల సంతలో మాంసము మొద లైన పదార్థములు దొరుకును.

విజయనగర భాగ్యదినములలో, బోగమువారి యురవడి యెక్కువ, వారు "పురపల్లవ ప్రకర నేత్రానంద బాష్పాంబుధారా పర్జన్యచంచలాలతికలు. దుర్వార ప్రసూనాస్త్ర తేజోవైశ్వానర సామిధేనులట! (మను) ఆ వెలఁదు లందఱు సంగీత నాట్యము లందందెవేసినచేతులు. అంతేగాదు. "బాసగ్రుతి సెప్పవలఁతులు" కలభాషిణి వీరికంటె రెండాకు లెక్కువఁ జదివినది. ఏకేకదా

సంత గ్రాహిత్యము కూడకద్దు. నారదుని శిష్యుఁడైన మణికంధ రుఁడు గృష్ణునిపై దండకమును జెప్పినాడు. వెంటనే యెదురుగ కలభాషిణి దాని నంతయును మరల నొప్పజెప్పినది. దాని యీ "కూకటివేళిలో కురులుగూడని" చిన్నతనమునందు.

అంతఃపురములో "అచ్చరలకొలము" వారికి నిరాతంకమగు ప్రవేశము. ఆ రాజులకే వారిలోఁ గొందఱు ప్రేయసులుండెడివారు. అందుచే – కర్ణాట ప్రభువుల గొలువులో వారికిఁ గొన్ని ప్రత్యేకాధి కారములు కద్దు. ఎంత గొప్ప సామంతుఁడైనను రాజునాసలేనిదే సభలలో గూర్చుండుటకు వీలులేదు. కాని, బోగమువారు మాత్రము గూర్చుందురు. మల్లురకుగూడ నీ యధికారముండెను. వీరిర్వురును రాజుల యెదుటనే తాంబూల సేవనము గూడ సేయవచ్చును. ఎవ్వరుగాని వారి నాక్షేపింపరు. రాజులకును, రాణీ లకును, అభ్యంగనాదులైన సర్వోపచారములను "నట్టువకత్తులే" దీర్పవలెను. చామరలు వేయునువారు. కురులు దువ్వునువారు. అన్నము వడ్డింపనువారు. ఆకులెత్తనువారే. కొందఱు రాణీలు వీరిని గానములందును, నాట్యములందును, సుశిక్షితలఁ జేయుఁ చుండిరి. కలభాషిణి ద్వారకయందొక నటముఖ్యుని కూతురు. దాని గాత్రసౌభాగ్యమునకు మెచ్చిన కృష్ణభగవానుఁడు జాంబవతి మొదలైన యష్టమహిషులకును, కలభాషిణినిని "రెకమెండు" చేసెను. వారందఱు దానిని గానమున బిద్దిరట! కృష్ణుని యంతి పురమున కలభాషిణి కంతచనవు.

ఆ సమాజమునందు బోగమువారు దూష్యముగాదు. వారికి సమాజమున గౌరవముండెను. దేవరాయల నాటికే యిఱువది వేలకు పైగా వారుండిరి. వారి వృత్తివలన రాచవారికి వచ్చెడి పన్నుతోఁ బన్నెండువేలమంది "దలారులు" నిర్వహింపబడుచుండిరి. "పల్లవుడు బేదపడిన నేదుభాగ్యము వారిది. ఒక్కొక్క నట్టువకత్తెకు దిక్కులేనంతమంది దాసీలు, వాటి నట్టుకత్తెలో భాగ్య మింతటిది.

What is remarkable is in that city they are not lacking Courtzans so wealthy, that single one of them from her own wealth pay for several thousands of Soldiers, and dispatches them for war. They themselves take part in Battle, they stimulate by love of themselves the spirit of the fighting men to fortitude"

ఆ నాట్యకత్తెలు పూతపసిండి వంటి వలిపెంబుచరించు టలోఁ గడు నెఱజాణలు. వరిగింజ నొకటనే వాడు బల్వెరుసఁదోమెదరు, ఒత్తిన ముత్యంగొంపక మేన విగ్గులుదేఱఁ బసపాడి జలకమాడెదరట! ముడుకగాకుండఁబయ్యెదలోనె గేలార్చి యొంటను జంటఁగలపములదు "నెఱతన మాగరితలది." రతి రచించ్చినసూత్రమున జిక్కక ముత్తెములు రాల గరగరికలు వహింతురు. పాలసినవె పెట్టినరువైనఁ గులము తెలియుదురట! ఇది "సాహిత్తి

సమరాంగణ సార్వభౌముని” వర్ణన. దీనికి మూల పదార్థమును పదునైదవ శతాబ్దము మొదటనే (1424) భాస్కరుఁడను మహాకవి యొసఁగినాఁడు. తన జీవంధర చరిత్రమున భాస్కరుఁడు వేశ్యమాతల నిట్లు వర్ణించెను.

మఱల సరవియ హోసెవకొరడి నా
ళెవ కోవమరిచి కంగళ
తళెవె—ధరెగగనవనుతాళవమాడి,చాడిసు వ
శిలె యొళగె ముఱుగువ తుషారవ
నళెన—నీరొళు బెణ్ణెగళెవ
గ్గళద—వేశ్యమాత యర నవనీళ సీక్షిసిద.

ఈ భాస్కరుఁడు “పెనుగొండ” యందుండెను. అతఁడే స్పష్టముగ “పెనుగొండన శాంతీశ్వరున జనవాసదలి, జీవంధర చరితెయరచిసిదను” అని చెప్పికొన్నాఁడు. సంగముల కాలమున “పెనుగొండ” జైనులకు గొప్పపుణ్యక్షేత్రము. హిందూదేశమున వారి పుణ్యక్షేత్రములు నాలుగు. అయోధ్య, జినకంచి, బెళగొళ, వేరొకటి పెనుగొండ. రాయల “ఆముక్తమాల్యద” లోని వర్ణన “భాస్కర” మహాకవి కనుకరణమే.

ఆ కాలమున “గణికల” వీణాపాండిత్యమును రాయలిట్లు అలంకారములో సూచించినాఁడు

ఉ॥ వేవిన మేడపై వలభివేదిక( జంట వహించి విప్పగా
బూవులు గోట మీటుతరి( బోయెడు తేటుల మ్రోత కామిశం.
కావహమౌ( – గృహాభ్యసనకారున దంతపుమెట్ల వెంబడిన్
జేవడి వీణెమీటుటలు – చిక్కెడ లించుటలున్ సరించుచున్.

(ఆము.)

ప్రాతఃకాలమునందా నాట్యకత్తెలు మేడలముందు వడసాలలో( గూర్చుండి ప్రావిరులను విప్పుకొనుచుందురు. పూలు - కవిసమయమును బట్టి తెల్లనివిగదా! ఆ పూలను వారు జడలో వీణెలకు మెట్లనువలె చేర్చియుందురట! ఆ విరుల వాసనకు తుమ్మెదలువచ్చి చుట్టును ఝుంకారము సేయుచుండును. ఆ సన్నివేశము గణికలు వీణవాయించుచున్నట్లుండునట! వల్లకిలోని "సారణి" మొదలగు తంతెలను శృతిజేర్చి మ్రోయించినపుడు తుమ్మెదల ఝుంకారమువలెనే యుండును. కృష్ణరాయలు వీణావాదనలోలుడు.

ఈ గణికలలో( గొందఱు "శివాచారైకశీలలు" వారికున్న యున్ని తొడవులతోబాటు "రశనాసూత్రస్థిత స్వర్ణపేటీ విన్యస్త కపర్దియు" (ఆ. ము. 1-33) నొకటి. వారు జంగములను "సర్వమంగళాసన్న మనోహరాంగములు జంగమ లింగముల"వలెనే (ఆ. ము. 1-55) జూతురు. మఱికొందఱు వైష్ణవాచార సంశీలలు. వారు "శ్రీకార్యపరుల( గాంచిన వినయముతో వేచి మ్రొక్కుదు రట! అప్పటి సవిలాసమైన - యా విలాసినుల యంజలికి దేవేం

ద్రుఁడు గూడ నువ్విళ్ళూరువాఁడట! "అథమాన్వయజీర్ణాలా పఙ్క్యాల పిలుపును లాభమున్నను వారి తర్ణము అంగీకరింపవు. వారి జీవనమునందలి యనేక వివరములు, మనకు "శ్రీకాళహస్తి మహాత్మ్యము" ను వ్రాసిన ధూర్జటి నడిగినచో దెలియును.

"దేవదాసిలు" సమాజమునకుఁ గళంకమనువాదము ఈ నాఁడు ప్రబలముగ వ్యాపించినది. ఈ ప్రచారముపై నాకు కళా దృష్టితో – సామాజిక దృష్టితోను, యెక్కువ సానుభూతిలేదు. సమాజమునందు మంచి చెడ్డలు రెండును చాలకాలముగ స్థానమును సంపాదించుకొన్నవి. దాని స్వరూపమే యిది. ఎంతవారికైనను మానవజాతి "యిట్లే యుండవలెనని" శాసించుట అసాధ్యము, అనవసరముగూడ. కాని మన మొక చిక్కును దొలగించుకొనుటకై వేరొక క్రొత్తబాధను కొని తెచ్చుకొందుము. దానిని పోగొట్టుకొనుటకు మరియొక మార్గ మన్వేషింతుము. ఈ యన్వేషణ హనుమంతునితోకవలె దాను దాను పెరుగుచునే యుండును. దీనికిఁదుదియెక్కడ!!

ఈ మాటలు నే ననుటలో నన్నొక "యభివృద్ధినిరోధకునిగా" ఇంద్రియలోలునిగాఁ, జాలమంది వ్యాఖ్యానింతురని నేనెఱుఁగుదును. నాకు "సంఘసంస్కారము" బనికి రాదనికాదు. సాధ్యము గాదనియే నాగొడవ. నాకునుగూడ వారందరివలెనే స్త్రీ లందరును "సీతమ్మ" లై మగవారందరును రామచంద్రులైన సమాజమును జూచి, యానందింతమనియే యున్నది. కానీ వాల్మీకి కాలమునందును యట్టి సమాజముండెనో! లేదో! యని నా యనుమానము.

ఇట్టి గళాదృష్టితోఁ జూచినపు డీప్రచారములో గలుగు నష్టము పేక్షింపఁదగినదిగాదు. ఆ కథయే వారికి గాబట్టదు. కావలసినచో వారి స్థితిని మనముఁ జక్కఁబఱుపవచ్చును. కళా దృష్టిని వారికింతకంటే యెక్కువగఁ గలిగించుటకై పాటు పడవచ్చును. సంఘమునందు వారికిఁగల యమర్యాదను దొలగించుటకై ప్రయత్నింపవచ్చును. మన ప్రాచీన సంఘమునందు శైవులు ముఖ్యముగ వైష్ణవులు, దేవదాసికిచ్చిన గౌరవము చాలగొప్పది, వారేర్పరచిన నియమములను జక్కగ ననుసరించుచున్న యే "దేవదాసి" యైన నేడున్నచో - నామెకుఁ జేయెత్తి మ్రొక్కుటకు నా కెట్టి యాక్షేపణములేదు. ఏ నియమమునకైనను హృదయ ధర్మము మారవలెను. అదిలేనిది యే ప్రయత్నముఁగూడ కేవల విడంబమే. ఈ నాడును "మద్యనిషేధ ప్రచారము" వంటివి మన మెన్నియో చేయుచున్నాముగదా! అదియట్లుండె.

తిన్నెల నెత్తమాడుట యానాటి పాత్రల కొకవిద్య. అంతిపురముల యందున్న గణికలకు బయటివారితో (కా.మ. 1-55) "సంబంధ బాంధవ్యములు" ఉండెడివి. ఆనాటి సమాజమున కీ నట్టువకత్తెలపై నెంత దృష్టియనఁగా, పెద్దనామాత్యులకు చాతుర్వర్ణ్యము తరువాత పెద్దగా వర్ణింపదగినవారు వారే యైనారు. (మను. 1-50)

కృష్ణరాయనికే ప్రత్యేకముగ నాట పాటలకొక మేళముండెను. దానికి నాయకుఁడు విద్వత్సభారంజక శ్రీ రంగరాజు.

వీనిబిడ్డ రంజకం కుప్పాసాని, ఇదిచేసిన దానములకు లెక్కలేదు. దీని తనూజ ముద్దుకుప్పాయి. ఈవిడ అచ్యుతరాయుల యంతః పుర పరిచారిక. దీనికిఁగూడ "విద్యుత్సభారంజక" బిరుదుండెను. చాతుర్యవతియైన దీనిని - అచ్చుతరాయులు, తిరుమల శ్రీనివాసు లకు, పరిచారికగ సమర్పించెనట! సామాన్య సమయములందేగాక యుద్ధవేళలయందును వీరు రాజులను వదిలి పెట్టెడువారుగారు! రాయలు రాయచూరు యుద్ధమునకుఁ బోవుచు దనవెంట నిరవై వేల "నాట్యకత్తెలను" తీసికొని వెళ్లెనట! ఆనాటి రాజులు దేవుం డ్లకు మాణిక్యములతోఁబాటు గాణిక్యములగూడ నొసగిరి. ఆ కార్య మును పుణ్యమని వారు నమ్మిరి. అన్నసత్రములతో బాటు "అతివల సత్రముల"ను గూడ వారేర్పాటుజేసిరట! ఈ నాటి భావసంపత్తితో మనము వారిని నిందించినచో మనకు అలఁతగలిగి ఒక గ్లాసు మంచినీళ్ల ఇచ్చే తప్ప చచ్చినవారి కేనష్టమునులేదు. అనాడే కొందఱొకవైపు "నటవిటగాయక కుటిలవచస్సీధురసము" అని యిట్టియభిరుచులను దప్పుపట్టుచునేయుండిరి. కాని ప్రజాసామా న్యముచెవులలో వారిమాటలు దూరలేదు. వీరశైవులు, వైష్ణవులు, రెండు సంప్రదాములును "దేవదాసీల" నాదరించిరి. నాటి రాజులు యుద్ధవీరులకు శౌర్యమును నూరిపోయుటకుఁగూడ వీరిని వాడుకొన్నారు.

విజయనగరమువారి భాగ్యమనంతము. అప్పుడుగూడ ధనిక దరిద్రభేదము దండిగ లేకపోలేదు. కాని జీవితమున కవ సరములైన "కూడు గుడ్డలు"లు అందఱి కందుబాటులో నుం

డెను. కడపదగ్గరి చెన్నూరువారికి వజ్రములు దొరకెడివి. వజ్ర కరూరునందు దొరకెడి వజ్రములతో సమాన కాంతిగల "నిగరాలు జగతిలోలేవట! పాండూరు కొండలలో చక్కని మగరాలు వారు సేకరించుచుండిరి. వీనిని గురించి "నికోలీ కోంటీ" యీ క్రింది కథ జెప్పినాడు. మాంసపు ముక్కలనుదరిగి నా లోయలలో వేయుదురు! వాని కాలోయలలోని వజ్రములంటుకొనును. గ్రద్దలా మాంసపు ముక్కలను గఱచికొని – పై కెగిరినపిదప వారా పక్షులనుతోలి వజ్రముల నేరికొనుచుండిరట! ఈ కథ మన పాలిటికి నేటికిని "అరేబియన్ నైట్సు" వంటి కథగానేయున్నది. కృష్ణానది ప్రవహించు లోయలును, వారికి జాతిరత్నములను, సంపాదించి పెట్టెడివి. కుంతలమునందలి కోమలాంగులకు పజ్రాల సొమ్ములపై వలపుమెండు. వారి "కర్ణహాటకరత్న తాటంకయుగధాళ ధళ్యములకు" కవి సార్వభౌముండైన శ్రీనాథుడు తక పిక లాడినాఁడు.

నాటి భిల్లకాంతలుగూడ పట్టు చీరలు గట్టుభాగ్యంబు గలవారే, (కా. మ. 3-6) రక్తచందనము గుగ్గిలంపుఁబొగలు తట్టుపునుఁగును, (కా. మ. 3-38) తనివిదీర వారనుభవించుచుండిరి. "పుట్టతేనియ, పెరతేనె, పుట్టజున్ను, తొఱ్ఱతేనియలు, వెదురుబ్రాలు, ఆనాటి చెంచులకు సమృద్ధములు. పండ్ల ధాన్యములు వారికున్నన్ని (కా. మ. 3-69) మఱెవ్వరికినిలేవు. ఈ మాటలకు మన మాశ్చర్యపడ నవసరములేదు. ఆనాటి శాసనములు కొంచెము పెద్దమనసుజేసి, మనము దిలకించినచో, విప్ర

వినోదులు, వీరముష్టివాండ్రు, దొమ్మరులు, దేవాలయముల కిచ్చిన దానములెన్నో మన కంటబడును. కడుపుగాల్చుకొను వారు దానములొసగుటకు కర్ణులా! యేమి? విద్యానగరమునంపలి యొక తమలపాకులమ్మెడు దాని సౌభాగ్యముతో "రోము" నగర మునంతయు బేరమాడవచ్చునట! ఇవి యానాటి రాయబారుల వ్రాతలు.

విజయనగరము నాటి "యౌవతములకు" అలంకారము లలో మేలుకీడులెన్నుకొనెడి - లీలలిట్టివి.

ఉ॥ అంచిత హారవల్లికల యాభరణంబులదక్క ద్రోయుఁ జి
ల్మించుఁబసిండి — యేణమదమంగము జేర్చుటఁదక్క ద్రోయుఁ జి
డ్డంచుజవాది — ధూపితమయందుడిఁదక్క విడిర్చుబూవుఁ జె
ప్మంచు — జిలుంగుఁదక్కనగు యౌవతమొత్తుగటంచు నన్యముల్.

(ఆము. 1–61.)

వారు "ఇనోప్మఁదట్టినపునుఁగు"ను వాడెదరు. ఆ యిండ్లలో "గొజ్జగినీటి వెల్లువలు" గోవజవాదులనిగ్గు. వారు ధరించునవి, ఊదిన బాఱుదువ్వలువలు, చంచజ్జరతాహి కంచుకపుఁజాయ మడుంగులు; "మృగమదము" సద్యోవినిర్భిన్న సారంగనాభికా హృతమైననే వారికిఁ బ్రియమట! వసంతములు మొదలగు సమ యములందు మద్యపానమునకు ధర్మశాస్త్రము వారికడ్డురాలేదు. "అగరుమృగమద సంకుమద కుంకుమ పటీర కర్పూర హిమాం

బుపూరముల వాసనలతో, ఆ జనులు, నాఁడేగాదు నేడుగూడ మనదేశ చరిత్రను "బుగ బుగ" మనిపించుచున్నారు. అనాటి పడఁతులు ఆభరణముల భారమున "నడువలేకుండిరని విదేశీ యుల వ్రాతలు. తల్లికోట యుద్ధమున నోడిపోయిన తిర్మలుఁడు తొందరగ రాజధానికి వచ్చినాడు. శత్రుసేనలు వెన్నంటి తరుము చున్నవి. ఆ హడావిడిలో వాఁడు చేయిజాచిన మాత్రముతో నం దెడు ధనమునుగైకొని పెనుగొండకుఁ బరువెత్తినాఁడు. వాఁడు దీసికొనిపోయిన భాగ్యముయొక్క వివర మీ క్రిందిది. నూట యేబది యేనుగులపై బంగారు, రత్నములు, నలువది నాలుఁగు కోట్లధనము, అరచేతి మందపు బంగారు ఱగడులుగల్గి – రత్నమ యమైన సింహాసనము, తిరుమలరాయని చేతికిఁజిక్కక శత్రు వులచేతికి దొరికినదెంతయో! ఎవరికినియుంచక, నేటికిని భూగర్భ మున శయనించిన "నిధుల" విలువలెంతటివో! రాయల పట్టాభి షేకమునాటికి, అంతకు ముందటిఖర్చు వెచ్చములుపోగా మిగిలిన ధనమిది. విద్యారణ్య బొక్కసములో 99 కోట్లు 56 లక్షల ద్రవ్య ముగాక, భూషణాలు నాలుగుకోట్లు, నవరత్నాలు 6 కోట్ల 56 లక్ష లున్నవి. ఈ వరకు రాజుల సెలవు వెచ్చాలుపోను, మిగులు 19 కోట్ల 56 లక్షలు. కర్ణాటక రాజ్యం పదికోట్ల 84 లక్షలు. దేవాదాయ బ్రహ్మదాయ సర్వమాన్య మఠాదులకు 60 లక్షలుపోగా మిగులు పదికోట్ల 24 లక్షలు. (రాయవాచకము) అనాడు బెళూరుమకట నొక కంచు దేవళముండెను. దాని పొడవు వెడల్పు పదిగజములు.

ఆ కోవెల యైదు గజములయెత్తు. దానిలో నొక స్వర్ణ విగ్రహ ముండెడిదట! ఆ విగ్రహమునకు కనులు రత్నములు. మన మే వైపునుండి చూచినను, ఆ విగ్రహము మనలనే జూచినట్లుండును. అది యా స్వర్ణప్రతిమను దీర్చిన శిల్పకారుని నైపుణి.

తుంగభద్ర వారిపాలికి, సాక్షాత్కరించిన భువనేశ్వరీ దేవి. ఆమె వరాహపర్వతమున, ఆది కూర్మదంష్ట్రా విటంక ముల జనియించి, దివ్యమాతయై దిగివచ్చును. ఆ జనులు, తుంగభద్రలోఁ బండుగ పబ్బములందు తానమాడెదరు. ఆ స్త్రీలు "అంభఃకేళి సల్పంగఁ దద్గురువక్షోరుహలిప్త సంకుమదకస్తూరి మిళచ్చందనాగరు పంకంబులలో (ఆ 2-6) నా విలాసిని బ్రవ హించును. వంపా తరంగరింఖా, ఝంపాసంపాత్యమాన జలకణరేఖా, సంపాత శీతలానిలములు (పా. మ.) ఆ జను లకు రసికలు దిద్దెడివి. ఆ తుంగభద్రకున్న యొయ్యార మేనదికిని లేదట! రంగత్తుంగ తరంగహస్తములు జాచి యొక్క సారి యా రత్నాకరేంద్రుడే తుంగానదీ యంగసౌఖ్యమును మఱ గెనా! అటుపై సతడు గంగను మెచ్చడు. కావేరిని దేవేరినిగా నంగీకరింపడు. యమునతో ఆనందోత్సవములు ఆచరింపడు. పాప మాభాగ్య మా తుంగభద్ర కంటలేదు. ఆమె "కృష్ణవేణి" మఱుగున నొదిగి యొదిగి నిలచి నేటికిని రత్నాకరునిదృష్టి నాకర్షిం పనేలేదట! రాయలాముక్త మాల్యదలో –

మ॥ తలఁబక్షచ్ఛటగ్రుక్కి చాతుపులు కేదారంపుకుల్యాంత ర
స్థలి నిద్రింపఁగఁజూచి యారెకులు షస్నాతప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటులన్పవి దఁదదావాసంబు జేర్పంగ రే
వులడిగ్గన్ – పెసఁజాఱ వానిగని నవ్వన్ శాలి గోప్యౌఘముల్.

(ఆము.)

ఈ వర్ణనము పంపాతీరవాసులకు స్వభావోక్తియేగాని, యుత్ప్రేక్ష యేమాత్రమునుగాదు. ఆనాటి యువతులు "పసవు రాయగా" రత్నపు దాపక్రింద, నం

బువు, దెఱవాఱగా నిదువవోయి గరుత్తుతి పచ్చవారిపన్
భవన సరోమరాళములు ధర్మమయచ్ఛ దగుచ్ఛ విస్ఫురత్
ద్దివిజధునీ మరాళముల (ఆ. 1–64) భ్రాంతిని గల్పించుట పక్షిబి

వేశమందేగాదు, విరూపాక్షుని సన్నిధియందుగూడ, ఆ వర్ణనలో చత్రముల తాపలు "హంసలు" ఈ రెండును కొంత స్వభావోక్తి పరిధినిదాటి యెగిదినపంతే.

కన్నడ కవులకు విరుపాక్షుడన్నను – తుంగభద్రయన్నను బరమప్రాణము. ప్రసిద్ధులైన వీరశైవ కవులందఱు పంపావతి పాదములచెంత బెఱిగినవారే. వారి విరూపాక్షభక్తి మన శరీరములఁ బులకింపజేయును. తుంగభద్ర ఆ మహాకవులకు జగన్మాత ప్రపంచము నోదార్పవచ్చిన పార్వతీదేవి. వారు తుంగభద్రను వర్ణించిన తీరులిటఁవడువ మొదలు పెట్టినచో, మన ప్రసంగమే ముగియదు.

ఆనాఁడు జీవించినది సుఖస్వప్నమువంటి ఒక రసికజాతి. జీవితమును వారు ప్రేమించునట్లు ప్రేమించుటకు మనకు సాధ్యముగానిపని. ప్రవృత్తి నివృత్తులయందు సంపూర్ణ స్వాతంత్ర్యము వారిది. ఆద మఱచి రాజ్యసుఖములనుభవించుచున్న పాండ్యరాజొకసారి. "భోగినీ సంగతికి" బోవుచుండినాఁడు. అప్పుడొక పరదేశ బ్రాహ్మణుఁడు పీఠికత్న్నైపైఁ గూర్చుండి యొక "సుభాషితము"ను భాషించుచుండెను. దాని నా రాజు విన్నాడు. మనుష్యుఁడు వర్షాకాలమునకుఁ గావలసిన పదార్థములు వుండే సేకరించు కొనవలెను. రాత్రికి గావలసిన వానిని ప్రొద్దుటను, వార్ధక్యమునకు గావలసిన యనుకూలములను, యౌవనమునసే జేసికొనవలయును. అట్లే "పరలోక సాధనల"ను బ్రదుకుండగనే గావించుకొనవలెనని యీ పద్యార్థము.

ఏ విషయమునుగాని "యేదోపోనీలెమ్మని" యుపేక్షించుట ఆ జనుల మనోధర్మమేగాదు. ఈ పద్యమును విన్నరాజు వెంటనే మఱలి పశ్చాత్తప్తుడై, మతసిద్ధాంత రాద్ధాంతములకై, పండిత వాదములేర్పాటు జేసినాఁడు.

అతిసామాన్య విషయములందును, వారియభినివేశము అంతులేనిది. వానకాలములో బాటసారులు ప్రయాణించుచు, వర్షము వచ్చినప్పుడు దారి ప్రక్కలనున్న సత్రములలోఁ జేరుదురు. అపుడు వారి సంభాషణ లేమనుకొన్నారు! "హయపతిమీద దంతిపతి - నాతనిపై నృపతిన్ గజాది నిర్ణయములు సేయుదురు.

(ఆము. 4-131) వారి ప్రసంగములు పెరిగి పెరిగి - "మొత్తులాట" వరకును వచ్చునట! దేనియందును "ఉపేక్ష" వారెఱుఁగనే యెఱుఁగరు. ఈ గుణములలోఁ జెడిపోవు చున్నవారము మనమే.

"చతుర్విధ పురుషార్థము" లందు దేనినిగూడ, ఆ జనులు అనవసరమని త్రోసివేయలేదు. అన్నిటికిని సమానమగు నధికార మును వారొసఁగి, ఆదరమును జూపిరి. "తపస్సింహాసనాసీనుఁడైన" వానికిని "మన్మథ రాజ్యసింహాసనాసీనునకు"ను వారి దృష్టిలో భేదములేదు. ధర్మార్థ మోక్షములను సాధించు పట్టుదల వారి కెంతయో, జీవితావసరమైన తృతీయ పురుషార్థమునను, వారి యభినివేశమంతే. శరీర సుఖము వారికొక శాస్త్రము దాని నభ్య సించుటకు "ననవిల్తు శాస్త్రంపు మినుకులు గావలెనట!

ప్రతి వస్తువునను సౌందర్యమునే వారుచూచిరి. గజముల మదాంబువులలో "పొగడపూవంటి కంపులను వీక్షించిరి. వాదం తములలో "మధువర్ణ"మును భావించి ముచ్చటపడిరి. ప్రాణ భయముతోఁ బరువెత్తి వచ్చుచున్న మనోరమకు "విలాస విభ్రమ లక్ష్మల్ దక్కుటఁయును నొకయొఱపై, నెక్కొన్నదట! (మను.) ఆమె పరుగెత్తు యొయ్యార మెట్లున్నదో జూడుఁడు.

శా॥ మట్టెల్ మ్రోయగ గుబ్బచన్నుగవ కంపంబంద వేణీ భరం
బిట్టై కటిచిమ్మచీకటులుఁగా నశ్రుప్రవాహంబోడికట్
గట్టన్ చూపులు చిమ్మిరేగి చివి రోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాండగ వరుండులేని యడవిన్ మీనాక్షి దీనాకృతిన్. (మను)

ఇంతకన్న చిత్రమైన ఘట్టమొకటియున్నది. యాదవ భూనాయకున కొక దాసియుండెను. రాజు భోజనవేళలోఁ బళ్లెరము పెట్టు కొలువుదానిది. ఒకరో జది "జంగమార్చనము" చేయుచు కొలువునకుఁ బోమఱచెను. నృపాలకు లోకతప్పనైనను గావరుగదా! (కా. మ. 1-48) ఆతఁడా నట్టువకత్తెను వెంటనే బిలిపించి, "దాని మనోహర మూర్తి రేఖకు" వెలితిగదా! యని యైనను సంకోచింపక తాల్మిలేక తలగొఱిగించినాఁడు. ఆమె మొత్తుకొనుచు జంగమునిదగ్గరకుఁబోయి వాని పాదములపైఁ బడినది. ఆ సన్నివేశమును ధూర్జటి -

చ॥ పడి – బిగువైన పీన కుచ భారముపఁకధరిత్రి సోవపం

డెడు. తనువల్లితో నమస్కరించెనట! ఈ ధూర్జటిని రసికుఁడనవలెనో, అరసికుఁడనవలెనో నాకుఁదట్టలేదు. ఒకప్పుడట ఒకని గడ్డమునకు నిప్పంటుకొన్నదట! వాడాబాధకు మొత్తుకొనుచు గడ్డమును దులిపికొనుచుండగా, ఒక నాగరకుఁడు గొంచెమాగవయ్యా చుట్ట ముట్టించుకొందు నన్నాడట. ధూర్జటి శృంగార మట్లున్నది. తూర్పున కతిదీర్ఘముగ్లై "వెడలుచున్న నీడలయందు" రజనీతరుణి మునివేదూతికలను జూచిన శృంగార ప్రియులు వారు (మను. 3-13) అపరాంబు రాశిని గ్రుంకుచున్న పంకజబంధుఁడు "తదీయ బడబాముఖ రిజాంకురిత కుతుక రథ్యనిరంకుశ వేగాపహృతశతాంగు (మ. 3-14) డట!" పాంథ్యాభాగములు శుకతుండకాంతితో వెలిఁగెనట!

తమ యేలుబడిలోనున్న యూరిపేరులనుగూడ – సుందరముగామార్చి, లేని యొయ్యారము ననుభవించినవారు వారు "ఉదయగిరి" "మణినాగపురి" యట! పెనుగొండ "ఘనగిరి" "సురగిరి" యైనది, "బేలూరు" "వేలాపురి"గా మారినది ఆ రాజులు. కట్టించిన భవనములకు – ముద్దులు మూటగట్టు నామకరణములు. రాయలుకట్టించిన భవనము "మలయకూటము" పెనుగొండలో నాతఁడు గట్టించిన మేడ "గగనమహలు" రామరాయలు నిర్మించిన సౌధములు "రత్నకూటము" ఆనందమహలు. వారిభార్యలకా రాజులెంతో ముచ్చటైన పేరులుంచుకొన్నారు. రామరాయల భార్యలలోఁ దిర్మలాంబపేరు "మనమోహినీదేవి" యట! మఱియొకతె జ్ఞాన చింతామణి. ఈ విషయమును "చందోర్కు"రను మహారాష్ట్ర చరిత్రకారుడు వ్రాసినాఁడు.

పూవులన్న రాజనులకుఁ బరమ ప్రాణము. ఒక దినము అన్నమైన వదులుదురుగాని, పూవులులేక రాజనులకుఁ బూటగడువదని విదేశీయుల వ్రాతలు. వారుప్రేమించిన పుష్పములు చల్లని రంగును, సరసమైన వాసనతోఁగలవి. గొజ్జగులు, కమలములు, కలువలు, వారికభిమాన పాత్రములు. వానిని సూనకములుగ దాల్చిరి. ఆ పతంపతకుసుమములు జేసికొనిరి. మేఖలలుగధరించిరి, కంకణములుగవాడిరి. రసికతతో "మీకన్న మేమేమి" తక్కువయని, మగవారుగూడ "నిడుపపెన్నెఱి" వేణులను బెంచినారు. వారివి అనితంబవిలంబికాలాహికల్ప ఘనకచగ్రంథుల"ట! పురుషులుగూడ దనివిదీర "గురుపున గొత్తచెంగలువ

కచ్చులు దాల్చిరి. కృష్ణరాయల బాహామృగ నాభిసంకుమద సాంద్రాలేప పంకములతో భూదేవికిఁ కుల పర్వతములు మొదలైన అరసికులు, రాచికొనగానైన గంట్లుపూడినవట! (మను, 1–33) స్త్రీలతోఁబాటు పురుషులకును "చతురలంకారములు" గావలసి వచ్చిన కాలమది.

వారమితముగ నాపరించిన రెండపభోగము వీటికాసేవనము. ఆ నాటిప్రవరుఁడుగూడ "మృగమద సౌరభవిభవ ద్విగుణిత ఘనసార సాంద్రవీటీ" గంధములలోని తరతమభావము వము లెరిగినవాఁడే, శైవులగు "జంగములు" సార్వకాలిక తాంబూల చర్వణార్ద్రరాగ సౌభాగ్యమునపద్మ రామణులఁ దృణముగా జూచు దంతపంక్తులతో (కా. మ. 1-30) బారాడుచుండిరి. పామర ప్రమదలును "తరుణధావనధగధగద్దశన మణులయందు లేతవీడ్యముల (పాం. మ. 3-74) డాలుహత్తుకొల్పిరట! విదేశ రాయబారులు తమ కొలువులకేతెంచినపుడు నాటిరాజులు మర్యాదకై వీడ్యములిచ్చిరి. ప్రియాప్రియులు చమఁయెదిరికి మనసులోని మరులను వక్కలాకులతోఁ దెలిపిరి. శాలీనుని మనసు గమనింపలేక కలఁతఁబడుచున్న సుగాత్రికి, "కర్పూరంబుతోడిబాగాలీరాదో! అనుమడుపు యీరాదో! చెలీ! అని చెలికత్తెలొసఁంగిన సలహా. మనసులు విఱిగి వేఱిడుచున్నమగలు మగువలును, తాంబూలములు మార్చుకొని తొలగినారట! (వీర తాంబూలము అన్నిటికిని) ఆనాటి కవులకుఁగూడ, రాజులిచ్చెడి మర్యాదలలో

కర్పూర తాంబూలములేని కనకాంబరా భరణముపై మనసు లేదు.

మనకు శాస్త్రము విధించిన గొప్ప యుపకారము స్నానము. దీనిసౌందర్యము మనవలె నితర దేశీయులెఱుఁగరు. నాటి ప్రజలకు ప్రతిదినమును "తలఁగడుగు మామూలు" పాండురంగ మాహాత్మ్యమున, తెనాలి రామకృష్ణుఁడు నిగమశర్మ యొక్క నిత్యవిధులిట్లు వర్ణించినాఁడు –

చ॥ తలఁగడుగంగ మర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వల కలమాన్న భోజనము – చందనచర్చ – ప్రసూనదామకం

వీనియన్నిటిలో "నాల్గుదినంబుల భోగమబ్బిన యా మహారాజు పులుగడుగఁగబద్ధ నుమముత్తైపు" పోలిక, వీధులు జూట్టెడివాఁడట!

స్నానము జేయుటయందానాఁడు ధనికదరిద్ర భేదములేదు. కలవారు తలకు గంధామలకంబు పెట్టుకొంచురు! తెలిగొజ్జగినీరు "జల్లికొంచురు. సంపెగనూనెలు గంధపొడి వాడెదరు. లేనివారు "చమురంటుకొని" నీరు బోసికొందురు. కాని యొకటి మాత్రము నిజము. ఎంతటి బీదలైనను, కురులకుఁ గాలాగరు ధూపమును మాత్రము వేసికొని తీరవలెను. ఊరిలోని దేవరఁ జూచుటకైఁ బ్రయాణమైన పామర ప్రమదలు, నిశామిళితవారితో జలకమాడి,

కనుల గాటుకదీర్చి, సిందూరమున దిలకమిడికొని, విరులు సిగఁదాల్చి ప్రయాణమైరేగాని యెట్లున్నవారల్లె కదలలేదు. అప్పటి తిన్నడుగూడ "జలకంబాడి" అనెడు (కా. మ. 3-38) పెద్దమాటనే వాడిగొన్నాడు. గాని "స్నాన" మనుమాటతో వానికి దృష్టిగలుగలేదు. మనలో మగవారము పూలనెన్నడో వదలితిమి. మన స్త్రీలలోఁగూడ స్నానమున బసుపువాడుట, కాటుకదిద్దుట, మొదలగు నాచారములు పోయినవి. పోవుచున్నవి.

విద్యానగరమునందలి జనులు, సర్వకాలములను బ్రేమించి, తమకు భోగ్యములుగఁ జేసికొందురు. వసంతములు వచ్చును. అప్పుడు ఇప్పలలర్చు గాడుపులు వీచును. (అము. 5-104) ప్రసూనములు వారికి "రజనీకనకాభిషేకములు" సేయును. పుప్పొడుల నంటినతేటులు జడలకెక్కును. (పా. 4-14) వారపుడు కస్తూరివదలి యుగరు బూసికొందురు. శిశిరమున మానిస ముత్యాలపేరులు మఱల ధరింతురు. అంతకుముందు శయ్యక్రింద నుంచుకొనెడు యినుప కుంపటులు మానెదరు. కురువేరును పూవులతోఁజేర్చి ధరించెదరట! ఆ పూవుల కారులోఁ గుప్పసముల్వొదల్చి వలిదుబ్బాల నొత్తి హత్తి సుఖింతురట! (అము. 5-104) మధుపానములతో వారికపుడు ప్రొద్దే మిగులదు. వసంతములందు వనితలు అచ్యుతరాయువీణలు "శ్రుతిజేర్చి" హిందోళ, వసంత రాగములను బాడెదరు. దానిని భట్టుమూర్తి యిట్లువర్ణించెను.

మ॥ అరిగా పంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళపై
ఋరిజూపన్ పికజాత మాత్మరవ భంగవ్యాకులంబైన, నీ
వర నాలింగిత పల్లవవ్రత విధుల్ దాల్పన్ తదీయధ్వనిన్
సరిగాగైకొనియెన్ వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్. (వసు. 1)

హిందోళ రాగమునకుఁ బంచమసర్వము వర్జము. అందుచే దానినివారు "అరిగా" జూచినారు. ఋషభస్వరమును వర్జించి రనియు నొకయర్థము. అపుడు కోయిలలకు పెద్దగొందలమైనది. అవి చిగురుటాకులు మేయుచు నడవిలోఁ దీవ్రమైన తపస్సును బట్టెను. వాని తపస్సునకు మనస్సుకరగిన వసంతుడు "మీ పంచ మమును గ్రహింతును లెమ్మని, వారిప్రార్థనము" "మంజూరు" చేసినాడు. అతఁడు మహాసంపూర్ణ భావోన్నతుఁడు. "పంచమ మును" "సరిగా" గైకొనెను. అనఁగా ఋషభస్వరముతోఁ గూడ ననిన యర్థాంతరము. భట్టుమూర్తి నాటికి వసంతరాగము సం పూర్ణమేమో! ఇపుడది "యౌడవషాడవము." ఆ కాలములందా యువతీ యువకులు డోలావిహారము సేతురు. వారిపాదములు త్రైవిష్టపస్త్రీల యౌదలదన్నునట (కళా. 1-44)

నిదాఘములు వచ్చును. అప్పుడు గ్రామములందుఁ జలు వచప్పరములు వెలయును. రాత్రులయందుఁ జెఱకు వంటలు సేయుదురు. ఆకాలమున "మల్లియలపెల్లు" కన్నడ కవితావితా నము వలె షట్పదీవృత్తవిలాస భాసురమగును. ఆవేసఁగులయందు "నిష్ఠానిధియైన" విష్ణుచిత్తుఁడు భాగవతులకుఁజేయు నుపచారము

లిట్టివి. "తెలినులి వెచ్చయోగిరము" దియ్యని చారులు దిమ్మన ములు – పలుచని యంబళులు, చెఱకునీరు, యెడనీళ్లు, రసావళులు ఫలంబులు, సుగంధి శీతజలము, పడిపిందెలు, నీరుజల్లయు, సంపాదించి, యతిథులు "చాలుచాలను సంతవరకు" (ఆము. 1-81) వెలయఁగ బెట్టునట! మధురానగరమున కెండకాలములోఁ బరదేశివిప్రుఁడొకఁడు వచ్చెను. వాడు భోజనమునకు – రాజపురోహితునింటికిఁ దగిలినాడు. వారియింట ఆవిప్రుఁడు గడుపారఁ దిన్నభోజనమిది.

సీ॥ పరిపక్వ సురభిరంభా ఫలంబులతోడ
దలమెక్కు పనస పెందొలలతోడ
ఘృతఖండ నిభశర్కరీ ఖండములతోడ
పలుదెఱుంగుల మావిపండ్లతోడ
గోస్తనీ మృదుగుళుచ్ఛ స్తోమములతోడ
గప్పుదేలిన పడప్రప్పుతోడ
సుమధురస్థూల దాడిమ బీజములతోడ
దనుపారు రసదాడిగసెలతోడ

"పూనావృష్టిగ" దిన్నయావిప్రుడు పాసకముగ్రోలి, చందన చర్చఁదేలి విరులుసిగదాల్చి కర్పూరవీటిని – "జౌరు" గొట్టించి నాఁడట! వేసఁగులలో మాంసభుక్కులైనవారు

క॥ దాడిమ్యాదిగ సూక్ష్మమాత ఫలయుక్తా లాభిఘారస్వన
స్ఫారాభూపిత శుష్కదంబు "హృతమాత్స్యచ్ఛేద" మ్మంను

కొల్లలుగ నుండును. ఆఁగనరు "వాసన" పోవుటకు సంధ్యా వేళయందు గేళికాంతారాభ్యంతర వాలుకాస్థిత హిమాంతర్నాళి కేరాంబుఫలను (ఆము. 1-64) త్రావెదరు. ఈ భోజనములను తలచినపుడు వారివి, కడుపులా బావులా! యనిమనకనిపించుట సహజమే. అపుడు ప్రియాప్రియులు.

పవరెల్ల చీకిరాంబువు చల్లపోరాట
నలసి, మృణాళ కోమలములైన
బాహువుల్లమదుమార్పముల కెదురుగా.
మలచి, మూపులఁ గరతలములునిచి
ప్రాల్మాలి, మిగులనార్పని కప్పు క్రొమ్ముడిఁ
దనియొగ్గ విరవాదివండ విరియ
ఘొలగంధామోద శిరలస్తనములు
హొందఁ గౌగిళ్లలో బోరగిల్లి
నారికేళాసవప్పుఁ దీపుటూటు పొందు
వలిపె యొంబొల్లలో సురత్సులఁ గూర్కు.

ప్రియులు వేకువఁదొడ తెచ్చరించి, వెన్నెల బయళ్లో (ఆ. 2-61) యందు సుఖములనుభవింతురు. ఎండకాలము అం దచ్చుటచ్చుట "చలిపందిరులు" వెలయును - వానియందు సౌకా

త్కరించిన శృంగారరసాధిదేవతలు "ప్రాపాలికలు" నిలిచియుందురు. వారి జడలయందు మల్లెలు, అస్త్రీలు నిదాఘమునకు భయపడిన సలిలము, ఆగామిబీజార్థమై, తడవంబెట్టిన వారి దేవతలై (ఆ ము. 2-57) యొప్పుదురట. వారు వోయుజలమునందు వాసనలకొఱకై వేసిన యుత్పలపత్రములు (ఆ. ము. 2-58) వారు చమ తెలిమోము పసమెచ్చి తలయూచు పాంథులజూచి నవ్వుచు, ఆ నవ్వులో వారి హృదయముల గదలించుచు, "పలిచన్నుకొమరు ముచ్చిలిన దిమ్మ"ను తెఱంగున గరిశ కాగులముంతురు. నాఁడు "చలిపందిరులలో" నీరు వోయుటకు మగవారిని నియమింపరు. ఒకవేళ యేర్పాటుచేసినచో, ఆ పందిళ్లలోనికి జనులుపోవరు. ప్రపలయందు నీరు ద్రావిన పాంథులంతటితోఁ బోవక, యా యాడువారికి "లాచివిడియము"లిచ్చి పోదురట! ఆ యిచ్చుటఁ దన్ను మఱవకుమని చెప్పుటకు.

ఒక "దుష్టుఁడు" నీరు ద్రాగవచ్చినాఁడు. ఆ పోకిరి

ఉ॥ తొడిబడ నమ్మయక్కయని తూలుచు దీనత దోయిలొగ్గుచున్
వడమటి తేర తేరనలవాక్యము లెన్నక మోముగుబ్బలన్
గడుగొనుకక్ష దీధితు లెగాదిగ గన్గొనుచు

"చిట్టకంపుద్రావుడు" (ఆ. ము. 2-59) ద్రావుచున్నాఁడు. వాని దుర్మార్గమునుజూచి "ప్రపాలికలు" సన్నలతో నవ్వుకొన్నారట! రాయలవారి యీ భావము నొరవడిగ నుంచుకొని లక్ష్మీశుఁడు,

జట్టిపట్టి యొళొల్లియుంకుళిర్వెరసి దర
వట్టి గెయసదనంగళింద బాగిల్గె పొర
మట్టు, కళసవనెత్తి సీరె లెవకామిని య
దురు బాహూమూల దెదెసె

దిగ్గి పరి వరిదు మొగమొగ్గడిసె సరిసకళ
వట్టి జలధారె పొరసూసె బయలిగె బాయ
బిట్టు నగిసువరల్లి తృషె యిందబంద
మధి కెర్కాళా బాలెయరను.

అన్న యనుకరణమును గావించెను. నాయపోయునడ "లలిత చంపక తనుచ్ఛాయదిం కెంపిడిద జలధారె"యటు చంపక చ్ఛాయగలవారి శరీరముల కాంతులతో నా నీరెరు పెక్కినది.

ఇంతలో పర్షాకాలమేతెంచును. కడిమిచిగిర్చును. అరటి పిల్లలు వేయును. గేవగులు వికసించును. ఏనుగులు భూమిని మూచూచును. ఆ కాలములలో నంబళ్లు మోసికొని "కాపుగుబ్బె తలు" పొలములకుబోదురు. అక్కడ 'పెన్మొసురున్ని' గెడుకాపు గుబ్బెతలపెన్నుబ్బులుబ్బునాసల్వాలిం 'బిసికిళ్లున్ బిసికిళ్లు' (4-133) హాలికులకబ్బునటు! ఆ నాళ్లలో విష్ణుచిత్తుని యిల్లాలు "నారి కెడ పుంబొరియల్దగిలించి (ఆ. 1-80) వంటవండును. అంతకష్టకాల

మునగూడ నాతని యింట నతిథులకుఁ గలహాస్యమును, ఒల్చిన ప్రప్పు – నాలుగేన్నొగసిన కూరలు, పడియము, పచుగులు, ఒడ గులు, ఘృతప్లుతులు దప్పవు. వర్షాకాలములందు రెడ్లు, గుడుగుం జెంచెలి దుమ్మిలేత గిరిసాకులందుఁ దింత్రిణీపల్లవములు సేర్చి, నూనియలలో వేయించి "వానిజతలో" అరుగబియ్యపు టన్నమును దిందురు. మేకయెముప్పుపేసి మంటజేసిన గుంపటులుచాల్చి, క్రేవు లుమేయి నాకుచుండగా, మంచములపై సుఖింతురట!

శరత్తు ప్రవేశించును. కలశసూతికాకతకాఫలమై కలక నీరు మాలిన్యమును వదలును. భూభాగము శకటాపు చక్రధార చేఁజాపటఁదీర్చికొనును. శిఖినతాండవము. "కళానికగఁ జేసి, కఱకుటీకల పేరికానెబిగువు సడల్చు"ను. మంకెనలు బూయును. జెల్లులసెల్లును. మదపము బూచును. గజవాసము, విజృంభించును. అపుడు మహారమములు నీ రాజనపూర్వకముగ అశ్వములకు రక్షగట్టెదరు. గుడుపులు పల్లలకుఁ జలకపూజలు సేయింతురు. ప్రజలు జిచ్చుఅతొరణములు చూతెదరు. తొలిపంట కములు సిగబంటిగ భుజింతురు. (పాండు. 4-11) ఈ శరత్తు లందుఁ బుష్పాయుధుఁడు యుద్ధమునకు బయలుదేరుటకై సైన్య ములఁజేర్చికొని వెలిగుడారములలో విడియును, ఆ సమయము లలోఁ గోపికారాజి.

సీ॥ శ్రీబదారౌటవాశ్రిత. పద్మకర్ణికా
కృతిజెవుల్కలమ కర్ణికలమెఱయ
నతను సాపత్న్యకృద్రతిరేఖ మంచెపై
నదలించు రొదఁజిల్క పదువుబఱప
దొగమొగ్గలనుపైవ దూరమోఁగమి బెట్టు
చప్పట్లఁ బన్నులు బదలు గదల
పెదఱ్ఱోవమును జెప్పి వడినవ్వ — దిటుగ న
ధ్వగులకొలందినె యపత్రపయు మరఁ

గీ॥ నధర రదన ప్రసాదంబు నడుగవోప
దెఱచెనన బండిఱ్ఱీలి ముత్తెములు వోచు
చెఱకు జంపులఁ బోలమి శిరసువాల్చి

(ఆ. ము. 4–163)

రాజనపుఁజేలను గాచుచు పాలచినపటి! నిక వారే కాలమును నిరాదరించిరి? ఏసమయములను పక్కుపగఁజూచిరి? వారియాహార విహారములన్నియు, "నెలకొని వేసవిఁజలువయు, బలివేళలనుష్ణగుణమును," గలిగించెడునట్టి కాలానురూపములు. సమయానురూపములు, వారనుభవించిన భోగభాగ్యములకు మం.. కనుటయు చప్పుకఁ గలుగును.

మానవజీవితములో యున్ని యంచులను చవిచూచినవారి క్రియాశూరతను అదృష్టమును మనమెంతఁ బొగడినను వారి

యందు "చక్కని రసికత" కంటెను, "లాలసత" కొంత యెక్కువైనదనియే యనవలె. ఆ నాటిజనులు, విజయగర్వముతో మదించి తమ మేరలను, కొలదిగ దాటపోయినమాట వాస్తవము. వారు బ్రదికినది హైందవ మహమ్మదీయ నాగరికత "జల్లి బిల్లిగ" బెనవేసికొన్న కాలమందు. ముస్లిము "సంస్కృతి" యందు "లాలసత" యున్నంత ధర్మదృష్టిగానరాదు. వారికి ధర్మము సుఖమునకుఁ దరువాతిది, ఆ గుణము నాటి హైందవులకును గొంత యంటినది.

ఈ "లాలసత" నాటిజనులకేగాదు, వారేర్పాటుజేసికొన్న దేవతలకుఁగూడగద్దు. వరూధినీ కామమును నిరాకరించి యింటికిఁ ద్రోవఁబట్టిన ప్రవరుఁడు, అగ్నిదేవునెన్నోరీతులఁ బొగడినాఁడు "దివిషద్వర్గము నీముఖముననే దృప్తిగాంచు" నన్నాఁడు. బదులు రాలేదు. "నిన్నిశుగాశ్రుతులు బొగడునుగదా!" యని యగ్ని గొప్పతనము నగ్గించినాఁడు. నీవు "సమస్తజగదంతర్యామి" వనియాతని "రాచరికము"ను బొగడినాఁడు. "ఆహవనీయంబును, దక్షిణాగ్నియును" నీయందేగదా యుద్భవించుననని యాతని సర్వాధారత్వమును బలికినాఁడు. కడకు "గ్రతూత్సవసంధాయక!" యని యేమెమో యొయ్యారముగఁ బిలచినాఁడు: ఇదేదియుఁ గార్యసాధకముగా దనుకొన్న ప్రవరుఁడు "స్వాహావధూవల్లభా!" యని ముగించినంతనే, యుత్సాహము రేగినవహ్ని "హా" యని పైకిలేచి నిలచినాఁడట!

నాటి జనులు స్త్రీలను భోగ్యవస్తువులుగ మాత్రమే వాడు కొనిరనుమాటలో, గొంత నిజమున్నది. స్వరోచి, మనోరమను వివాహమాడినాఁడు. ఆమె కిర్వురు చెలికత్తెలుగలరు. వారిర్వు రును, మహాముని శాపముచే, "దుర్దమరోగబాధలచే" బొక్కు చుండిరి. మనోరమ కెప్పుడును వారినిడలచికొని దుఃఖము. ఒక నాఁడు స్వరోచి, యామె యనుత్సాహమునకుఁ గారణమడుగగా, నామె దనయిష్టసఖుల దుఃఖముదెల్పి వారి రోగమును బోగొట్టు మని ప్రతిమాలినది. ఇతఁడు "జరాదివ్యత్యాంతము" భట్టబెట్టిన ఘనవైద్యుఁడుగదా! వెంటనే యామెతోఁగూడ వారిచెంతకేగి, వారి రోగములను బోగొట్టి మనోరమతోనైన జెప్పక వారిద్దరి నేక ముహూర్తముననే బెండ్లిచేసికొన్నాఁడు. మనోరమ నాతఁడొక్క మాటయైననడుగలేదు. స్త్రీలపై నిట్టిదృష్టి యాసమాజమున కున్న దిగనుకనే, బహుభార్యాత్వమును వారు దోషమనుకొనలేదు. దాని నొక గుణవిశేషముగఁగూడ నన్వయించు కొన్నారు. కృష్ణరాయల కాంధ్రవిష్ణుఁడొసగిన వరములలో "నితోధిక బహుశ్రేయస్సీప్రా ప్తియు నొకటి "తమకు తమకఁ బ్రియుఁడని తమకమెసఁగఁ బణఁతులుప్పొంగ (మను. 6-62) బ్రదుకు బ్రదుకులోనే వారికిఁ దృప్తి. ఈ దక్షిణ నాయకత్వము వారికింత ప్రియమైనది గనుకనే, నరసరాజును గురించి పెద్దన "వనజేక్షణా మనోధనపశ్యతోహరు" డన్నపుడు, రాయలాకవిపైకి వాదుకుఁబోలేదు. అది తనతండ్రికొక "అడిషనల్ సర్టిఫికెట్టుగా" నన్వయించికొని గర్వపడినాఁడు. అం దుకే "ముక్కుతిమ్మనకవి చతురాంతఃపుర పథ్యాప్రసాదన

"రంకా!" అని సంబోధించి కృష్ణరాయఁడు, అంతఃపురమును గెల్చుటయు ఆదిల్షాను గెల్చుటయు సమానముగఁ దెల్చివేసినాడు. ఆనాటి ప్రపంచము యిల్లువాకిలిలేని సన్యాసిగాఁడు. వాని కింటిలోఁ "గూళకుల్ గొలిచిచేసిన కూరిమి సోమిదమ్మ" యున్నది. అతఁడుఁ ధార్మికప్రవృత్తి యెక్కువగాఁగల సంసారి మాత్రమే. అందుచే వాని "చక్రపానము" గాంచ సేయు జారతామినులకు భోగబాహ్యమైనది. వానినే పెద్దన్న పెద్దవైరాగ్యముగ (మ. 1-52) బొగడెను. అట్టి ధార్మికుఁడగు ప్రవరుని నెటిసుందరిగూడ వరూధినిని జూచినప్పుడు "భీతహరిణేక్షణ!" అని ఆ నాటి రసికత అనిపించిననేగాని వదలలేదు. పురుషుల బహు భార్యాత్వమే, ఆనాటి స్త్రీలకు ఉపపతుల సంగమమునకు సృష్టించినది. అంతఃపుర స్త్రీలలోఁ బ్రేమపై పోటీలుండెడివి. ముక్కుతిమ్మనగారి "పారిజాతాపహరణము"న జూచినప్పుడీవిషయము "చూచాయగా" గనుపించును. రాజుల ప్రేమలను జూఱగొనలేని భార్యలు విషపానములు గూడఁ జేసెడి వారట! "కాళహస్తి మహాత్మ్యము" నందొక సన్నివేశమిట్లున్నది.

సీ॥ పుడిసెడుగాని లేదిపుడు పుచ్చుక ద్రాగినమద్య మింతలో
నొకతెఱ గంపటించు నొకయుగ్మలి నాథునిదిట్టి యున్మదన్
బదియడ చూడుమంచు సరసంబున నొచ్చు తెఱంగుఁబోవ నవ్వుడు.

(కా. మ. 3-43)

చిగిగొగిట బొదిలినదట! ఈ పరిస్థితి తక్కువ జాతుల యందుండేగాదు. ఉత్తమజాతులలోఁగూడ నుండెడిది. అలంకారి

కులు చెప్పిన అభిసారికలును, విజయనగరపు నాటివారికిఁ పరిచితలే. ఒక్కొక్కసారి సవతులలో భర్తృ ప్రేమకైఁ బోటీ లేర్పడెడివి. అట్లే పురుషులకు, స్త్రీల విషయమునగూడ. వారు పరస్పర వశీకరణములకై, మంత్ర తంత్రములతోఁ బాటు, మందు మాకులును వాడెడువారు.

వేకువఁజాయందు విటునిచే వీడియుంబు
బుచ్చికొన దగదంతికిఁ బుచ్చికొన్న
మార మారంగఁ దద్ద్రవంబుమియవలయు (కా. మ.)

అని ధూర్జటి మహాకవి హితబోధ సేయుటతోఁబాటు, తన కావిషయములందున్న చొరవనుగూడ వెలుగఁబెట్టినాఁడు. ఈ భావములనన్నిటిని పెద్దనామాత్యులవంటి పెద్దలు "దుర్వారములైన కోరికలవంక వివేకము చొప్పదప్పుట" అని యానాఁడే ద్వేషించిరి.

ఇన్ని దురాచారములానాఁడున్నను, శృంగార విషయమున మాత్రము ఆజనులు స్త్రీలకుఁ బట్టాభిషేకమును జేసిరి. మగుడల ప్రతివేషమును, ప్రతివచనమును, ప్రతిచేష్టయు, వారికిఁ బ్రీతిపాత్రముగ నుండెను. "ఘనసారపంక మొక్కలతాంగి వెచ్చిన" ముట్టినవేలనై చుక్కబొట్టు పెట్టి "వేరొకతె" పూవు టెత్తులెత్తిన వినువుతో కొన్ని విరులు దురిమి, పడతి యొక్కతె రత్నపాదుకలిడగా తొడుగకుండగనే యవ్వలికి బోనడుగువెట్టు —

ఒక పద్మాక్షి "బాగాలు" జుట్టిప్వగా వెగ్గలమని, కొన్నిటిని వెడల నుమిసి - "సగము గొఱికిన యాకును, సగమొసగు నుత్తర మును, వెల్విసగమును మఱపు సగమునై చింతచే సగమై" - సప మదమై వచ్చినదట! వరూథిని. ఆమె కుచలు "పాటనచేయ కుండుటచేఁ బైపడినవి." "పటీరపంకలాలాటికము." (మను. 3-53) శీర్ణమైనదట! నిడుదవేనలి నామె నూనెముడివైచినది. ఈ వరూథిని తనువున తాపమగ్గలమై - తట్టుకొనలేక - ఆత్మ హత్యకుఁ దొడగినదట! పెద్దన - యామె దుఃఖమునెంతయో సానుభూతితో వర్ణించినాఁడు. కృష్ణునిపైఁ గోపగించిన సత్యాదేవి - మాసిన చీర గట్టనది. మూగవోయిన వీణవలెనైనది. తొడవులన్ని యుఁదీసి దిక్కులకువిసరి పూవులులేని తీగవలెనైనది. వాలెను కట్టు గట్టికొని - నిడువాలిక కస్తూరి బొట్టువెట్టి - మనోజవేద నతో - హరిచందన కొటరమందు నాగతరుణివలె - బుసలు గొట్టు చున్నదట! కృష్ణుఁడామె రెండు పాదములకు నమస్కా రమును జేసినాఁడు. సత్యాదేవి తన్నినది. అపుడు తిమ్మన్న నిజము నిజము, సత్యభామ మంచిపనినే జేసినది. "కాంతుల్ నేరముల్ సేయఁజె రలుకంజెందిన యట్టికాంతలుచితవ్యాపార ముల్ నేర్తురే!" (పా. 1-121) అని - "అమ్మగారి" వైపు "వకా లతు" దీసికొన్నాఁడు. రతి యందు సొగసు నడచివచ్చు మగువ తీరులను - కవి ధూర్జటి - వివరముగ వర్ణించెను (కా. మ. 1-47) పెద్దనామాత్యులు - పెద్దసీసపద్యములోఁ దమ సమాస పరికల్పనములోని చాతుర్యమంతయు జూపినాడుగదా! వివాహ

నంతరము - మనోరమకుఁ జెలికత్తెలు మజ్జనముదీర్చి - రవ రవలుగల కచపించమునకు గాలాగురు ధూపముగూర్చి - నిపుణతతో "జవాదినంటు" వాసినారు. ఆ మనోరమ పతికడకు వచ్చిన వేషమిది -

సీ॥ చెంగల్వ పూదండ సేర్చి పెందుఱుముపై
ఘనసారమున సూసకము ఘటించి
పన్నీటితోఁ గదంబము సేసిమృగ నాభిఁ
బూసి - కుంకుమసేస బొట్టు దీర్చి
విశదముక్తాదామ రశనఁ జిందురు కావి
వలిపపు వలువపై నలవరించి
యఱుత వెన్నెలగాయు హార మొక్కటిపెట్టి
మణుల సొమ్ములు మేనమట్టుపఱచి.

తే॥ కన్నుఁగవఁగెల్చి డాకాల గజ్జెనసఁగ
ఘల్లు ఘల్లన బెండెంబు గండు మీలు
గదల నల్లన నడిపించి పొదిలితెచ్చె
చెచ్చెలులపింఛ యువతి నా నృపునికడకు.

(స. ము. 6-5)

శృంగారమునందుఁ దాతగారి కెందును దగ్గిపోని మంగళి సూరన్న పుష్పాపచయము సేయుచున్న కలభాషిణి రూపమును - లలిత పదములుగల సీసపద్యములతో (క. పూ. 1-40) మన

కన్నుల యెదుట నిలిపినాఁడు. ఆమె బాల్యమును, కౌమారమును, యౌవనము, నాతఁడు విపులముగ వర్ణించి – యాలంకారికుల దప్పిదీర్చినాడు. "సుగాత్రి" తోటలోఁ దన మగనికిఁ దోడుపడఁ బనులు సేయుచున్నపు డాతఁడు సేసిన వర్ణన – జగ ద్రంజక మైనది. (క. 4-78) పైన పుసము బేర్కొన్న నాయిక లందఱు "దర్జా" గలవారు. వారికనుసైగలలోఁ పట్టుమని బది మంది దాసీజనము. అనుభవించుటకుఁ దగిన "హంగు" లన్నియు వారికున్నవి. సుగాత్రికి పాపము! యే యదృష్టమునులేదు. ఆమె యొక పూజారిబిడ్డ. శాలీనునితోడి వివాహమైనది. అతఁడొక చిత్రమైన పురుషుఁడు. మొదటి రాత్రి సుగాత్రిని చెలికత్తెలు "అలంకారకలిత" గాఁజేసి ఆత్మ నాథుని కడకనిపినారు. వాడు "దర్వీభూషణాది" మహిమకుఁదలఁకి మాటలే యాడలేదు. పోయిన సుగాత్రి పోయినట్లే వెనుకకు వచ్చినది. దాని తల్లికి అల్లుని వర్తనమేమియు నర్థముగాలేదు. ఆ యింటి యీ యింటి యమ్మలు "సుగాత్రి తల్లికి వింత యల్లుఁడు" దొరికినాఁడేయని – ముసి ముసి నవ్వినారు. వారి సదుపునకు దెచ్చికొని యామె, మఱల సుగాత్రిని రెండవరోజు – మూడవరోజును – మునుపటి వలెనే పంపించినది. సుగాత్రికథ పట్టి రాకపోకలే యయ్యెను. చెలికత్తెలు సుగాత్రి కుపాయములు నేర్పినారు. ఆమె వానిని "సిగ్గుతో" వినన‌ట్లు నటించి, యేకాంతమున, వారి యుపదేశము ననువర్తించినది. కాని మగని నడఁతలో మార్పులేదు. ఆమెకు వాని చిత్తవృత్తి యర్థముగాదు. పైగా తన తల్లి – మగనిని

"యేటుపోటు" మాటలను, ప్రక్కింటి పొరుగింటివారి హేళనములు, ఇన్నిటితోఁబాటు "తంగేటి జున్ను"వంటి భర్త యింటిలో నుండియు తన మనస్సు నావరించిన ప్రత్యక్ష విరహము, ఆవిడ - యిన్ని బాధలనడుమ - తన ప్రేమావేశము నెట్లుగుదించికొనెనో - మన మెఱుఁగము. పింగళి సూరన్న చెప్పలేదు. చెప్పకపోవుట చాల మంచిపని యైనది. ఆ పడఁతి చూచిచూచి – "నాకు మంగళ సూత్రం బీపాటి నుండుటయే పదివేలనుచు" నెంచికొనియుఁ వేఱొక్క లాగుననుండక, యతనికి నాయు రభివృద్ధికరంబులని వివిధాలంకారంబులెప్పుడేమఱక తాల్చుచుఁ దనతల్లి యాతని నేమియు నిట్టట్టాడకుండఁ బ్రార్థించుచుండిన దట! (క. 4–73) ఆహా! యేమి యామెవశిత్వము! నాటిసామాన్య సంసారములందలి – ధర్మశిక్షయెంతగొప్పది. సుగాత్రియొక్క హృదయమందుఁ గుదింపఁబడిన యీ విరహవేదన - పది పద్యములుచేసినంత పనిని మన మనస్సులపైఁ జేయును. అతఁడు వాచ్యముగ నామె విరహమును వర్ణించియున్నచో - నీ సౌందర్యమంతయు నేటపాలైయుండెడిది. ఆనాటి కవులలో నొక విలక్షణుఁడైన మహాకవి పింగళిసూరన్న, కాలముగడచుకొలఁదియు-నామె కా మగని మనస్త్రోపలు కొంత కొంత యర్థమైనవి. అంతపరకామె తన "కంతు సంతాపము"ను పిట్టకుఁగూడ దెలియనివ్వలేదు. తోటపనులు సేయు మగనికి తోడుపడ నారంభించినది. 'విభూషణాదులపై "యింపు" వోయినది. ఒకనాఁడామె యేకాంతమున మగనిదరిసె నది. అపుడు భర్త "యేమివచ్చితివని" ప్రశ్నించినాఁడు. ఆ

మా తోటసుగాత్రికేమో యవమానమైనది. ఆమె" లోకమువారలు పతికడకేకోర్కిని వత్తురని"? యెదురుప్రశ్నవేసినది. అహా! సుగాత్రి యెంతగడుసుది!! అంతేగాక - యిన్నిదినముల - దన హృదయము నావరించిన విరహము నంతయు-

కః ఓ నాయక! యితరమ్మలు
పోని మీమ్మపాటికైన బుద్ధిగలిగి నా
మానసములోని కోర్కెలఁ
బూనిక నడిగితిరి లోకపూజితనైతిన్.

(క. 4–111)

అని యొక్కమాటతో నాతనిపై విదలించివేసినది. "లోక పూజితనైతిఁ" అనునది - యెత్తిపొడుపో - సత్యార్థ కథనమో - మనకు దెలియదు. కవికిని దెలియదేమో!! ఆనాటి - యాడువారి- వయస్సులు - వేషాలంకారములేగావు. వారియేడ్పులలోఁగూడ - సౌందర్యమును భావించిన - మహనీయులువారు. సత్యభామాదేవి, "బాలపల్లవగ్రాసకషాయకంఠ కలకంఠ వధూకల కాకలీధ్వని"తో నేడ్చినదట! ఈ యేడుపుల వర్ణనలో, ఆనాటి కవులెట్లు, పందె ములు వేసికొన్నదియు – దెనుఁగువారికిఁ దెలియని వృత్తాంతము గాదు. అసలు – యేడ్పులోని సౌందర్యమును – తొలుత తెనుగు వారికి నేర్పించినది శ్రీనాథుఁడు. "అతని కాశీఖండమున

కౌతకౌ'' కొసరి వసంతకాలమున క్రోయిలక్రోల్చిన భంగి సుందర ముగ నేడ్చినది! అపుడామెకు గారిన కన్నీటి బొట్టులెంతపాటి వను కొన్నారు! ఉసిరికకాయలంతలు పయోధరముల దిగువాఱినవట.

ఆ నాళ్లలో నింటను బైటనుగూడ నాఁడువారిదేనోరు! సత్యభామాదేవి యింటిలోఁ గృష్ణునిపై నెటులధికారమును చెలా యిం చు చున్నదియు మన మెఱుఁగుదుము. అంతమాత్రముతో నామె యధికారమాగలేదు. ఆమె కృష్ణునితోఁగూడ స్వర్గమునకుఁ బోయినది. వీరు పారిజాతమును బెరికి తెచ్చుచుండగా "సురేశ్వరు వనపాలకు" లడ్డగించినారు. అపుడు గృష్ణుడేమో వారికిఁ బదు లివ్వఁబోయినాఁడు. "వారితో నీవేమి మాటాడెదవు, వెనుకకు రమ్మ''ని యామె గృష్ణునదలించి –

సీ॥ వినుఁడు సురేశ్వరు వనపాలకులు, వార్ధి

బొడమిన యీదివ్యభూరుహమున

కింద్రాణియెవ్వతె? యింద్రుండు నెవ్వడు?

తోడి యిందరను గౌస్తుభము నెవ్వ

డధిపుఁడై ధరియించె నతఁడ సేకొనుగాక

తెక తేర విదియేమి యొకరిసొమ్మె!

యిదెనాదువిభునిచే నీవదాన్య వగంబు

నొడిపించికొని యేగుచున్నదాన

గీ॥ బలుకుఁ లేటికిఁ దాపీరపత్ని యేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుడైన
మఘవు నిబంధించి సత్యభామావిధేయు
నేత మరలంగఁ గొనుటెపో వాసితనము.

(పా. 4–58)

అని బింకముగ జవాబు చెప్పినది. కృష్ణుడు దన కామె యొసగిన "సత్యభామా విధేయుఁడన్న బిరుదును – పూల మాల వలె శిరస్సున ధరించినాఁడు. ఆ కృష్ణునకు సత్యభామ "పనిచిన పంపుసేయుట మహాప్రాభవ"మట! తొయ్యలులకు – హారములు గ్రుచ్చి యిచ్చుటన్నను (పా. 2-42) విసరుటలన్నను (పా. 1-109) లత్తుకలు దిద్దుటన్నను – కడకు వారి పాదములకు – రహస్యముగా – నమస్కరించుటన్నను – నాటి పురుషులకుఁ దికు్ లేనంత సంతోషము.

ఆ జగన్నాటక సూత్రధారి కృష్ణుఁడు – సాత్రాజితికి నమస్కరించినపుడు – ఆమెగారి "పదద్వయీపాటల కాంతి – శ్రీకృష్ణుని" మౌళిమణిపంక్తికి పన్నెవెట్టినదని - ముక్కుతిమ్మన్న - యుబ్బిపోయి పొగడెను. అనాటి జనులు జూచిన యుడవులుగూడ శబరకిరాతసమ్యక్కృత మన్మథశ్రమ విహార మహాఖురళీకుడుంగ (కా. మ.) ములట! వారికి ముక్తిగూడ "తాటంకవళిగ" వచ్చినగాని – రక్తిలేదు.

సామాన్య సంసారములందును - చిలుకకు మాటలు నేర్పుట - మయూరములకు నాట్యములు నేర్పుట - నాటి అల వాటేమో! శుకశారికాదులకుఁ దోడు జింకలనుగూడ బెంచుచు న్నట్లు దోచును. అనాటి గృహములలోఁ బారావతములు "మదక లముగ" నెలుగించుచుండెడివి. రాజుల యంతఃపురములలో చిలుకలకు గోరువంకలకుఁ బలుకులు నేర్పను - మణియుప్పుల మీది మయూరములకు "నాట్యము" నేర్పను - ప్రత్యేకమగు "డిపార్టుమెంటులే" యుండెను.

నాటి స్త్రీలేగాక పురుషులును - లలిత కళలపై - అధిక మైన - అపేక్షగనుపఱచిరి. "విద్యలందెల్ల సంగీతవిద్య మిగుల నుత్తమముగాదె" యన్న పలుకాడినది - చెలువలేగాదు - నాటి పురుషులుగూడ. కృష్ణదేవరాయలు గొప్పవైణికుఁడు. అతని యల్లుఁడుగూడ వైణికుఁడే అంతేగాదు. "నానా కళాపారీణుడు" గూడనట! ఆ నానా కళలేవియో మనకు వివరముగఁ దెలియదు. రాజుల యంతఃపురములందు నూర్లకొలది గాయనాచార్యులు, నాట్యాచార్యులుండెడివారు.

"వీణాపాణిం ధమపాణి" మనవలె "వెర్రిసంగీతము"ను గాక - యా కళా మర్మమెరిగి పాడుట వారికి వాడుక - ఇంటి యావిడలు "మేఘరంజనా" లాపముసేసి "పోషిత కలాపుల" నాడించెడువారట! చూడుకుడుత్తమ్మ పాడిన "మేఘరంజని" రాగముతోఁ బ్రత్యక్షముగ వానలేవచ్చినవి. ప్రపదుఁడుదన్ను

వదలిపోయిన నాటి సాయంకాలమున - వరూధిని - తనదుఃఖ మంతయు నాట రాగముతోఁ జెప్పికొన్నది. ఆ తరువాత నామె దానిని ముట్టలేదు. మఱుదినమున "ప్రభాతాయాత వాతాహత ము"లై యాతంత్రులు - నాటనే ధ్వనించుచున్నవి. వరూధిని విరహోపచారములతో - నిముసము "పురుసత్తు" లేకున్నను, చెలికత్తెలు, వరూధినికిఁజెప్పి, "దేశాక్షిరాగమున"ను కుంచుతంత్రులు మార్పించినారు. గిరిక వీరికన్నను బండితురాలు. ఆమె "కాంభోజీ" రాగమెక్కడ దప్పిపోవునో! యని, జాగ్రత్తగా, రాగపర్యాయము వదలి వదలి యేడ్చినది. తన యిష్ట మహిషలును సంగీతము నందు నారదునిదిద్ది తీర్చిన తర్వాత, శ్రీకృష్ణుఁడొక సంవత్సర మా విద్యలోని, తఱుగు మెఱుగులు సరిజేసినాఁడు. నారదుఁడు తుంబురుని వీణియను బుచ్చికొని పలికించి, "దానిశ్రుతుల వెంపున" కచ్చెరు వడినాఁడట! గోదాదేవి తంబురశ్రుతితోను - దాని సహాయములేకయే - స్వతంత్రముగను (ఆ. 5-153) బాడఁ గలదు. కృష్ణరాయలనాఁడు - అనేకులు ప్రసిద్ధ సంగీత విద్వాంసులు "కర్ణాట" సంగీతమునకు భిక్షపెట్టిన "పురందరులు" వ్యాసరాయులు, కనకదాసు, వీరందరును కృష్ణరాయని కాలము నాటి వారే. బండారం లక్ష్మీనారాయణ, లొల్ల లక్ష్మీధరుఁడు - నాటిప్రసిద్ధ సంగీత శాస్త్రకర్తలు. అళియరాముఁడు - తల్లికోట యుద్ధమునకుఁ బ్రయాణమైనపుడు - అతని వెంటపోయిన బ్రహ్మాండమైన బలగముతోఁబాటు - 4876 విద్వాంసులు, 5687 కవులు, 569 ఖడ్గితాళాలవారు, 479 మంది కేవలము -

తాళాగాంధ్రుండిరి. మన పురాణములందు - శివుడు "మద నాంతకుఁడై"నను - నాటి కవులు పట్టు బట్టి - మన్మథునెన్ని మారులో గెలిపించిరి. (పా.) అనాటి విటులు కామినీగోష్ఠితోఁ బ్రౌఢములైన చూపులతో - "యువతిభుక్త పరిధాన యుక్తులై" నిశ్శంకముగాఁదిరిగిరి. వారి నెవ్వరుగాదన్నవారే లేరు. వైదికులగు వారు గూడ "విపంచీస్వరంబున" జటలు చెప్పిన రోజులవి. నేటికిని - చక్కని వేదపండితు లెవరైన "జట" పలికినచో - వీణనో - గోటివాద్యమునో వాయించినట్లే యుండును. కాళహస్తి మాహాత్మ్యమున జంగముఁడాడిన మాటలు - నాటి రసికత (కా. మ. 1-37) యెంత వెక్కసమైనదోఁ దెలుపును.

"ఆనందో బ్రహ్మయనియు" సశరీరస్వర్గసుఖమనియు "లాలసత"ను వారెంత ప్రస్తుతించినను సాంసారిక జీవన సౌందర్యమును బొత్తిగ నాటిజనులు ధ్రువీకరింపలేదు. ధర్మబద్ధ మైన సాంసారిక జీవన సౌందర్యము ప్రవరుని జీవితమున మనకుఁ గనిపించును. విష్ణుచిత్తుని భార్యగూడ ప్రవరుని భార్య వంటిదే. ఆనాటి సాంసారిక జీవన సౌందర్యమును దెలుపుటకు ముత్తెమువంటి యుదాహరణము "సుగాత్రీ శాలినుల" ప్రణయ గాథ. ఆ యిరుపాత్రలను సృష్టించిన పింగళి సూరన్న ధన్యాతి ధన్యుఁడు. ఆ కాలమునాటి బాహ్యశృంగార నిదాఘములందు తిరిగి తిరిగి వేసారిన మన హృదయములకుఁ జలిపందిరి "వంటిది" సుగాత్రీ శాలీనులకథ. ఆమె వశిత్వము, ధర్మదృష్టి - పతిప్రేమ - వీనివెనుక నలగుచున్న - విరహము - భోగాభి

లాష – నిరాశ – ఈ భావశబలతతో – నొక యపూర్వవ్యక్తిగా – సుగాత్రి తయారైనది. ఆనాటి తక్కిన నాయికలందఱు "కలవంటు వారు" సుగాత్రి యొక్కతె సత్యమువంటిది.

విజయనగరము నాటి సాహిత్యమంతయు – లత్తుకలు మృగనాభిమకరికలు, కుంకుమ పత్రభంగములు, అంగదట్టములు, చంద్రికపావడలు, సున్నగావులు – చేర్చుక్కలు, సింధూరములు, చీనాంశుకధట్టంబులు – ఇవి ఒకజాతివి. తొంగలిరెప్పలు – సెలవివాఱునవ్వులు – నర్మగర్భములు – చిడిముడి చూపులు – గరిడిముచ్చుతనములు, జంకెనలు, దిసంతులు, చిలికినవ్వులు, కనుగవపిన్ననవ్వులు – ఇవి యొక జాతివి. ఇంతగాక మరేమున్నది.

ఆ జనులు – భోగులు – కార్యశూరులు – విజయ గర్వితులు. అందుచే ఆజాతి ధర్మమును మఱచి – "లాలసత"కు మఱగినది. అగుఱుమువారిని చంపినది, అయిననేమి! ముహూర్తం జ్వలితంతేజో నతు ధూమాయితం చిరమ్.

శ్రీ లలితా ప్రింటర్స్, కడప.